JAGATI Rs. 2-00 October 1989

34th Year of Publication




అక్టోబరు – 1989

## సాహితీ సుధ

శంకర పద్మగర్భ మురశాసనులన్ భువనేశులన్ నిరా
శంక ధృతిన్ మృగాక్షులకు దాసుల జేసిన మేటికిం గురం
గాంక వసంత మిత్రునకు నంజలి జేసెద వాగతీత ని
శ్శంక చరిత్ర విత్రునకు షడ్గుణ హారికి శంబ రారికిన్

—భర్తృహరి

శక్తిచాలనివాడు సాధుత్వము వహించు – విత్తహీనుడు ధర్మవృత్తి దలచు
వ్యాధిపీడితుండు దైవతభక్తి దొరలాడు – ముదిరి పాతివ్రత్యమునకు జొచ్చు
ఆపద ప్రాపింప నన్యా రికి గృశించు – భారంబు పైబడ్డ బరు వెఱుంగు
రమణి లేకున్న విరక్తి మంచిది యను – బని పోవ మౌనివర్తనము దాల్చు
ఈ యభావవిరక్తుల కేమి ఫలము – తినక చవి, చొరకయె లోతు తెలియబడునె
మదరిపు విశాల మునిజన హృదయలోల – వేణుగోపాల భక్తసంత్రాణశీల

—వేణుగోపాల శతకం

'జగతి' – 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు – 600004
ఫోన్: 76697 – చందా 2 సం॥లకు రు. 45-00 – 5 సం॥లకు రు 100-00 జీవిత
చందా రు. 300-00. పాట్రన్ – రు. 1000-00 విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: నాట్యకారిణి లక్ష్మి

# నిమ్మతొనలు

అనగా అనగా ఒకప్పుడు కొందరు రాజకీయులు బందిఖానాలో పడ్డారు. అందులో ఒకరు సోషల్ డెమొక్రాట్, యింకొకరు యనార్కిస్ట్, మరొకతను ఎంతో అణకువగల జ్యూ. వానాకాలపు చదువుగల ఆ యూదుని పేరు పిన్యా: జైలు అధికారులు ఈ ఖైదీలకు సప్లయిచేసే ఆహార దినుసులు, తేయాకు, పొగాకు వంటివి సక్రమంగా పంచేందుకు వారొక నాయకుని ఎన్నుకోవలసి వచ్చింది. యనార్కిస్ట్ (అరాచకవాది), పొట్టిగా పీలగా ఉండే ఈ పిన్యాని తప్ప మరింకెవరిని ఎన్నుకున్నా తను ఆమోదించనన్నాడు. విభేదాలెందుకని పిన్యానే తమ లీడరుగా అంగీకరించారు మిగతావారు.

అందరూ కలిసి ఈ జైలునుంచి పారిపోయేందుకుగాను సొరంగం తవ్వాడు. సొరంగం వెలుపల తుపాకీలతో కాపలాదారులు వుంటారు. ఎవరు ముందుగా సొరంగం వెలుపలికి వెళ్లడమూ అనే ప్రశ్న వచ్చింది. ఎవరికి వారు ముఖాలు చూసుకుంటూ వుండగా, 'నేను నాయకుణ్ణికదా - నేను వెళ్తాను' - అన్నాడు పిన్యా.

"ఈ కథలోని నీతి ఏమిటంటే, నాయకత్వానికి ఆకారమూ చిన్ననాటి చదువూకాదు ముఖ్యం" - అన్నాడు క్రుశ్చేవ్. ఆమాటచెప్పి, సభికుల వంక ఒక నిముషంపాటు, తేరపారజూసి, "ఆ పిన్యా ఎవరనుకుంటున్నారు - నేనే" అని ముగించాడు.

రిచర్డ్ నిక్సన్, ఉపాధ్యక్షునిగా ఉన్నప్పుడు మాస్కో వెళ్లాడు. అమెరికా ప్రభుత్వం తమ దిగువ సభలో ఆమోదించిన ఒక తీర్మానం క్రుశ్చేవ్‌కి కంటగింపుగా ఉంది. నిక్సన్, తమ పాలనాయంత్రాంగం పని చేసేతీరు వివరించాడు. అయినా క్రుశ్చేవ్ తృప్తిజెందక ఆగ్రహావేశంతో, "ఆ తీర్మానం గుర్రపు పెంటలా కంపు కొడుతోంది" - అన్నాడు.

నిక్సన్ వెంటనే "పంది పెంటకంటె నయం కదా" - అన్నాడు. (క్రుశ్చేవ్ తన బాల్యంలో పందులు కాసేవాడని ప్రతీతి)

ఈ ఎదురు దెబ్బకి క్రుశ్చేవ్ కోప గించుకోలేదు సరిగదా, పకపకానవ్వి, "మీరన్నది నిజం - మరొక విషయం మాట్లాడుకుందాం" - అని ఆ ప్రస్తావన మార్చేశాడు.

పదకొండు సంవత్సరాల పాటు 1953 నుంచి 1964 దాకా, ప్రపంచ రాజకీయరంగంలో మహా నాయకునిగా గొప్ప విదూషకునిగా

రాణించి, తన వాగాడంబరంలో తానే ఖందీ అయిన కృశ్చేవ్‌కి, తను అది కారంలోకి వచ్చేదాకా, బయట ప్రపంచంఎలా ఉంటుందో తెలియదు. చిట్కాలతోను, డబాయింపులతోను సమస్తం పరిష్కరించగలనని అనుకున్న అమాయకుడు - హాస్యమే ఆయనకు రక్ష.

ఏమండీ, మీ సోవియట్ యూనియన్ మార్క్సిస్ట్ లెనినిజమ్ అనే పేరుతో పిలువబడే ఈ కమ్యూనిజమ్‌నే నమ్ముకుని ఉంటుందా?" అని కృశ్చేవ్‌ని ఒకరు అడిగారట.

"తప్పకుండా - అద్దంలేకుండా, మీ చెవులు మీరు చూసుకోగలిగే రోజు వచ్చేదాకా మేము కమ్యూనిస్ట్ పంథాలోనే నడుస్తాం" - అన్నాడు కృశ్చేవ్.

ౕలిన్ కాలంలో జరిగిన దురాగతాల గురించి కమ్యూనిస్ట్ పార్టీ మీటింగులో చెబుతున్నాడు కృశ్చేవ్. సభికులలో ఒకతను "అప్పుడు నీవెక్కడ వున్నావ్?" అని ఒక చిన్న చీటి పంపాడు. మైక్‌లో ఆ చీటీ చదివి, 'ఇది వ్రాసినదెవరో నిలబడండి' అని ఆజ్ఞాపించాడు. ఏ ఒక్కరూ నిలబడలేదు. "ఆల్ రైట్ మీ రెవరూ చెప్పడం లేదు గనక జవాబు నేనే చెబుతాను. మీరిప్పుడెక్కడున్నారో, అక్కడ వున్నాను నేను" - అన్నాడు కృశ్చేవ్ గంభీరంగా.

సోవియట్ అంతరిక్ష నౌక ముగ్గురు వ్యోమగాములతో 1964 రోదసిలోకి వెళ్ళింది. "మీకు శుభ స్వాగతం తెలిపేందుకు సోవియట్ ప్రజలు ఆత్రంగా ఎదురు చూస్తున్నారు" అని చెప్పాడు కృశ్చేవ్ అంతరిక్షంలోని వ్యోమగాములతో రేడియో టెలిఫోన్ ద్వారా మాట్లాడుతూ! కృశ్చేవ్ మాట్లాడిన కొద్ది నిముషాల్లో బ్రెజ్నేవ్ అవే మాటలు చెప్పాడు - అంతరిక్ష యాత్రికులకి. నౌక క్షేమంగా భూమ్మీదకి దిగింది. వారికి సుస్వాగతం తెలిపేందుకు మహానాయకులు ఎదురు వెళ్ళారు. అయితే ఆ నాయక బృందంలో కృశ్చేవ్ లేడు. ఆ కాసేపట్లో పదవీచ్యుతి సంభవించి, గృహ నిర్బంధానికి లోనయాడు.

—క్షీరసాగరమ్

# పాఠకుల తీర్పు

గౌరవనీయులు చందూర్‌గారికి నమస్కారములు. 'జ గ తి' స్థాయి ఎంతో వున్నతమైనది. సాధారణ అభి రుచుల కోసం తెలుగుదేశంలో కావల్సి నన్ని పత్రికలున్నాయి - ఇంకా ఇంకా పుట్టుకొస్తున్నాయి. కాకమ్మ కథల్ని, 'వచనకవితలు' అనబడే తిరగమరగ వాక్యాలని ప్రచురించడానికి 'జ గ తి'ని వెతుక్కు రానవసరంలేదు. మర్చి పోతున్న గతకాలపు విలువల్ని గుర్తు చేసి, మరోసారి ఆ ప్రపంచంలోకి తీసుకెళ్లి, 'డైరీ'లో పాఠకుల్ని మీ వెంట తిప్పుకుంటూ, తెలుగుతనం ఎలా రూపుదిద్దుకుంటూ వచ్చిందో, ఎరుగని కొత్తతరం వారికి మార్గం చూపించే 'జ గ తి' శీర్షికలన్నీ పాఠకుల మనసులకెంతో దగ్గిరైనవి. అభినందనలతో

—యన్ ఉమాదేవి
హుబ్లి-20

ఎడిటర్‌గారికి : నమస్కారములు. రామాయణ పాత్రల విషయములో రఘు వేసే ప్రశ్నలవంటివి నేటియువతీ యువకులెందరో అడుగుతున్నారు. 'స్వధర్మ స్వారాజ్య సంఘం' వారు రఘుతండ్రిగారిచేత చెప్పిస్తున్న సమా ధానములు ఎంతో సముచితముగను, కనువిప్పుగను వుంటున్నవి. వారికి నా ధన్యవాదములు.

— కె మాధవరావు
బొంబయి-28

ప్రియమయిన చందూర్‌గారికి : నమస్తే! ప్రతినెలా 'జ గ తి' అందుతున్నప్పుడల్లా, మీవద్దనుండి ఉత్తరం వచ్చి ఆత్మీయంగా పలకరించి నట్లుంటుంది .... ఎన్నాళ్లగానో కేసరిగారి గురించి తెలుసుకోవాలన్న అభిలాష. వెతికిన గ్రంథాలయాలలో ఆయన గురించిన పుస్తకం దొరక లేదు. ఇన్నాళ్ళ మీరా కొరత తీరుస్తు న్నందుకు అత్యంత అభినందనీయులు. ఆనాటి జీవనసరళి, స్త్రీల స్థితిగతులూ అన్నీ ఆ స్త్రీజనోద్ధారకుని కలంనుండి చదవటం నేటిపాఠకుల అదృష్టం. .... చాలాకాలం తర్వాత మీకు ఉత్తరం రాస్తున్నా, ఆలస్యాన్ని అశ్రద్ధగా భావించకండి. మాలతిగారికి మీకు శుభాకాంక్షలతో.

—కెబి లక్ష్మి
హైదరాబాదు-482

---

స్నేహాలు మనంతట మనం చేసు కునేవి కాదు - ఈ జీవన ప్రయాణంలో గుర్తించవలసిన చెట్టునీడలు.

— ముద్రే

సీరియల్

# మంజిలి

## అన్నపూర్ణా రెడ్డి

గడిచిన కథ : కళాజీవి జ్యోత్స్న తన యిద్దరు పిల్లలని భర్త వద్ద వొదిలి వెళ్లిపోగా హౌస్‌కీపరు జానకి వారిని, లాలనతో ప్రేమతో పెంచుతోంది. ఉన్నట్టుండి డాక్టరు సారధి, హాస్పటల్ లో బెడ్స్ లేని కారణంగా ఒక పేషంటుని యింటికి పంపాడు. ఎవరా పేషంట్ ? (ఇక చదవండి

'అమ్మో !' భయంగా కళ్ళార్పింది విజ్జి.

"ఒరే ఫోరా .... దెయ్యం కాళ్లు .... మరి వెనక్కు వుంటే.... ఎట్లా నడుస్తుందట ?" రవి కళ్ళెగరేశాడు.

"అట్లాగే నడుస్తుంది.... అర్ధ రాత్రుల్లో స్మశానాలలో తిరుగుతుంటా యిట.... పెళ్ళిళ్లు కూడా చేసు కుంటాయిట !"

"నిజంగా ?"

పిల్లలు ముగ్గురూ దయ్యాల కథల్లో పడి కాస్సేపు ఓ మూల చేరుకొని కబుర్లు చెప్పుకున్నారు.

పరధ్యానంగా వున్న జానకి వీళ్ళ కబుర్లను పట్టించుకోలేదు. డాక్టరు గారి మాట కెదురు చెప్పి కోపం తెప్పించానా ? - అని మధనపడ సాగింది.

'పిన్నీ వెళ్తున్నాం !' అంటూ స్కూలుకు వెళ్ళిపోయారు పిల్లలు.

ఆయావచ్చి రోగికి నుదుటిమీద తడి పట్టీ వేసి, గొంతులో మందు బిళ్లలువేసి, నీళ్లుపోసి బైటవసారాలో ఓమూల కూర్చుంది.

డాక్టరుగారు భోజనం అక్కడికి పంపించమన్నారని మనిషి రావడం తో కేరియర్ సర్ది పంపించింది.

పిల్లలు స్కూలునుండి వచ్చి మళ్ళీ ఓమూల చేరి కథలు చెప్పుకుంటూ కూర్చున్నారు.

తప్పు చేశానేమో - అన్నభావం కుమ్మరిపురుగులా తొలుస్తూంటే అన్య మనస్కంగా తిరుగుతూ ఇంట్లో పనులు చక్కబెట్టుకుంది. అన్నం సహించ లేదా పూట.

ఆయా చీరచెంగు పరచుకొని వరాండాలో పడుకుంది.... పిల్లలు వెళ్ళిపోయారు....

ఇంట్లో భయంకరమైన నిశ్శబ్దం మనసు నిండా ఏదో గుబులు. ఎవరితోటీ చెప్పుకోలేని హృదయ వేదన.... కంటవెంట ఆపుకోలేని కన్నీరు.... ఎద ఎగసిఎగసి పడుతూంటే వెక్కివెక్కి ఏడ్చింది.

సాయంత్రం పిల్లలు స్కూలునుండీ వచ్చేవరకు శోకభారంతో ఒళ్ళెరుగ కుండా కటిక నేలమీద పడివుంది జానకి. పిల్లలు ఆటలకు వెళ్ళిపోయారు. వంటపని ముగించుకొని పిల్లలకు కాస్సేపు చదువు చెప్పింది. ఆరోజు నారాయణ రోజుకన్నా పెందలాడే పాఠాలు చెప్పించుకుందుకు వచ్చేశాడు. వాడి చూపులన్నీ మంచం అతడిమీదే వున్నాయి.

వేడిపాలు, గ్లూకోజు కలిపి ఆయా కిచ్చి రోగికి పట్టమని చెప్పింది. పిల్లలు కబుర్లు చెప్పుకొని నిద్రపోయారు ....

అలికిడైతే గుమ్మంవంక చూస్తూ స్తబ్దంగా కూర్చుంది జానకి. మనసంతా ఏదో వెలితి.

తొమ్మిదిగంటలకు సారథి వచ్చాడు. వస్తూనే రోగి దగ్గరకు వెళ్ళి పరీక్షించి "ఆయా.... ఎలా వున్నాడు పగలంతా ? ఏమైనా తీసుకున్నాడా ?" అని వివరాలు అడిగాడు. జానకి కాస్త ఎడంగా నుంచున్నా జానకినేమి ప్రశ్నించలేదు. ఆయాను ఇంటికి వెళ్ళి పొమ్మని చెప్పి తన గదిలోకి వెళ్ళి పోయాడు సారథి.

బట్టలు మార్చుకొని వచ్చేలోపల స్నానానికి నీళ్లు తొలిపి, సబ్బు తువ్వాలు వుంచి, ప్రక్కకు తప్పుకుంది జానకి.

స్నానంచేసి మౌనంగా భోజనానికి కూర్చున్నాడు సారథి.

తలవంచుకొని అన్నంకూర కలుపు కొంటూంటే వంటింటి గుమ్మంలో నిలబడి పరికిగా అతడి ముఖంలోకి చూచింది జానకి. జానకి ముఖంలోనూ అలసట ప్రస్ఫుటమౌతూంది. ఎదుట పడి చొరవగా కూరనార అందించ డానికి భయం పట్టుకుంది. భోజనం ముగించి పిల్లల గదిలోకి వెళ్ళి వాళ్ళ మంచాల దగ్గిర కాస్సేపు నుంచుని దిళ్ళు సరిచేసి, చెదిరిన ముంగురులు సవరించి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

గిన్నెలు తీసి వంటిల్లు సర్ది హాల్లో చాలాసేపు నుంచుండి పోయింది జానకి.

ఆ రోగిని చూడను అని తను సారథితో ఎదురు తిరిగినపుడు "తప్పదు" అని వుండకూడదా ? .... లేదా కోప్పడివున్నా తన కింత మనస్తాపం వుండేది కాదు. ఎలాగ వెళ్ళి డాక్టరుగారికి క్షమాపణ చెప్పు కోవాలి ?.... ఉదయం నుండి పదే పదే ఆలోచనలతో సతమతమైన జానకి నెమ్మదిగా అడుగులేస్తూ సారథి ఉన్న గది గుమ్మంలో నుంచుంది.

గుండె దడదడలాడుతూంటే గోడను ఆసరా చేసుకొని నుంచుంది.

కళ్ళు మూసుకొని పడక కుర్చీలో పడుకొని వున్న సారథి కళ్ళు తెరిచి గుమ్మం వైపు చూచాడు.

"జానకీ"

"లోపలకిరా, జానకీ"

లోపలికి వచ్చి అవనత ముఖియై దోషిలా నుంచుంది.

ముఖం సునిశితంగా పరికించి "అన్నం తిన్నావా ?" అన్నాడు.

"తినలేదుకదూ?....నీవు ఉదయం కూడా తిని వుంటావని నేననుకోను.... ఆ ముఖమెందుకలా ఉబ్బివుంది.... ఏడ్చావా ?"

తెలిసినట్టె, నిలదీసి అడుగుతూంటే, తలెత్తి ఓమాట సారధి వంకచూచి, తల దించుకుంది జానకి.

"డాక్టరుగారూ నన్ను క్షమించండి ?"

"దేనికి?" ఆశ్చర్యం ధ్వనించగా కంఠంలో "ఉదయం .... మీ మాట కాదన్నాను...." డాక్టరు ముఖం గంభీర ముద్ర దాల్చింది.... "జానకీ... మొదట.... నీవు వెళ్ళి అన్నం తినేసి రా.... ఆ తరువాతే.... నీతో ఏదైనా మాట్లాడేది...."

"ఆకలి కావడం లేదు"

"నేను నమ్మను, ఇది మానవ శరీరం, యంత్రంలాటిది... పరి అయిన భోజనం సకాలంలో పడక పోతే.... అనారోగ్యానికి గురి అవుతుంది....వెళ్ళు".

అయిష్టంగా వెళ్ళి.... కాస్త మజ్జిగ అన్నం తిని వచ్చింది....

"గుడ్ గర్ల్ - ఇప్పుడు చెప్పు. అయినా ఇంత చిన్న విషయానికేనా అంత గొడవ? రోగులకు సేవచేసే అలవాటు నీకు లేదు అని తెలిసి నీపై భారం మోపడం.... నాదే తప్పు"







"కాదు.... కాదు.... నా గుండె ల్లోని బాధ మీాకర్థం కాదు"

"చూడు జానకీ .... నిన్నటినుండీ నీవు అదోవిధమైన మానసిక శారీరక స్ట్రెయిన్‌తో అలసిపోయినట్టు అవుపిస్తున్నావు.... నీముఖమే చెపుతుంది.... ఆపేషెంట్‌కు తెలివి రాగానే మరెక్కడికైనా పంపించే ఏర్పాటు చేస్తాను."

"బాబుగారూ!"

"ఏం జానకీ?...."

"మీారు పనిలో చాలా అలసి వున్నారు. అయినా మిమ్మలను బాధించక తప్పదు. .... ఓ చీకటి రాత్రి .... ఈలాగే మీారు .... పడక కుర్చీలో కూర్చొని చదువుకొంటున్నారు. తలుపు బార్లా తెరిచేవుంది ...."

ఏదో గుర్తు తెచ్చుకుంటున్నట్టు కళ్లు మూసుకున్నాడు సారథి.

కాళ్లల్లో ఓపిక లేనట్టు గోడనానుకొని అట్లనే కూలబడింది జానకి.

మాసినచీర, చెదరిన తల, కళ్లల్లో భయం .... ఓ బక్కచిక్కిన అమ్మాయి ఊరుమాటు మణగిన తరువాత ఎగసిపడే శ్వాసతో తెరచి వున్న గుమ్మంలోంచి లోనికివచ్చి .... "బాబూ .... నన్ను .... కాపాడండి" అని వేడుకోవడం .... కళ్లముందు మెదిలింది.

"భయం లేదమ్మా ....తే" అంటూ లేచివెళ్లి గడియవేసి వచ్చాడు.

ముఖం చూడగానే తిండితిని ఎన్నో రోజులైనటనిపించింది.

గ్లాసుతో మంచి నీళ్ళిచ్చి, .... తీసుకో....అన్నాడు ....

గబాగబా నీళ్లుతాగేసి మూతితుడుచుకుంది....

"చూడమ్మ .... గిన్నెలో అన్నం వుంది. వడ్డించుకుని తినేయి" అన్నాడు తను.

"వద్దండి"

"ఫరవాలేదు, తిను.... ఆకలితో పడుకోకూడదు ...."

వద్దంటూనే అన్నంఅంతా శుభ్రంగా తినేసి గిన్నెలుతొలిచి అక్కడ పెట్టింది.

ఆ అమ్మాయి కళ్ళలో తారట్లాడే భయం పసిగట్టి:

"సరే.... ఆ గదిలో.... పిల్లలు పడుకొని వున్నారు .... అక్కడే పడుకో" అంటూ పిల్లలున్నగది చూపించి.... తను మాత్రం అక్కడే చాలా రాత్రి వరకూ పడక కుర్చీలో కూర్చుండిపోయాడు.

"డాక్టరుగారూ" జానకి పిలుపుతో ఆలోచన కంతరాయం కలిగింది.

"ఎవరు, ఏమి అన్న ఆలోచనైనా రాకుండా ఆనాడు నాకు ఈ ఇంట రక్షణ కల్పించారు. కానీ.... ఈరోజు మీా మాటకు ఎదురు చెప్పా నన్ను బాధ నిలువనీయడం లేదు."

"ఓహ్.... జానకీ.... వదిలేయ్ ఆ విషయాన్ని"

"లేదు.... లేదు.... అవకాశం వచ్చింది కాబట్టి ఈ అభాగ్యురాలి గాథ మీాకు విన్పించనీయండి...."

"అవసరమంటావా జానకి?"

"ఇంతకాలం అవసరం కలగలేదు కానీ ఇప్పుడు తప్పనిసరి"

"తప్పదు.... అంటే.... అలాగే కానీయ్...." సర్దుక్కూర్చున్నాడు సారధి.

## 21

అదినారాయణ గుంటూరులో తాలూకాఫీసులో యుడిసి.... అయిదుగురు సంతానం.... జానకి పెద్దది. భార్య అనారోగ్యంతో వుండేది. జానకి కాలేజీలో ఇంటరు చదివేది. ఇంటిచాకిరీ ఓవంక, చదువు ఓవంక .... జానకీ ఓర్పుగా ఇంటి బాధ్యతలను నెట్టుకొచ్చేది. భార్య మందుల ఖర్చులు భరించలేక, వెనుక గదుల్లో సర్దుకొని ముందుగది అదెకిచ్చారు.

అద్దెకున్న బి.ఎ. ఫైనల్ ఇం విద్యార్ధి రంగనాధ్ కలుపుగోలుతనం వల్ల ఆ ఇంట మాట సాయంగా వుండేవాడు. అవసరానికి బజారుకో, డాక్టరు దగ్గరికో విసుక్కోకుండా వెళ్లివచ్చేవాడు.

చామనఛాయలో పెద్దపెద్ద కళ్ళతో మంచి వొడ్డూ పొడవుకల వ్యక్తి రంగనాధ్. అతడి మాట మన్ననతో ఇంట్లో వాళ్ళందరికీ రంగనాధ్ అంటే ప్రత్యేకాభిమానం.

జానకి కోసం ప్రత్యేకించి పత్రికలు పుస్తకాలు తెచ్చిఇచ్చేవాడు రంగనాధ్. అతడి పలుకరింపులో, చూపులో ఏదో ప్రత్యేకత అవుపించేది జానకికి ...



బి.ఎ. పూర్తిచేసిన రంగనాథ్ ఉద్యోగాన్వేషణలో పగలంతా ఆఫీసుల చుట్టూ తిరిగేవాడు.

"రంగనాథ్‌గారూ.... సెలవుల్లో వూరెళ్లలేదేమండి ?" అమాయికంగా జానకి తమ్ముడు పదేళ్ళ బాబు పలుకరించాడు సాయింత్రం....

"లేదు బాబూ.... ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాను...."

"ఏమో ?"

రంగనాథ్.... బాబు మధ్య జరిగిన సంభాషణ జానకి చెవి దాటిపోలేదు.

ఓరోజు రంగనాథ్‌ను జానకి ఆ మాటే అడిగింది.... మీరు.... ఆ మధ్య ఉద్యోగం అంటున్నారు.... అదేం.... అప్పుడే ఉద్యోగపు యావలో పడ్డారు పైకి చదవరా ?".... అంది....

సూటిగా జానకి కళ్ళలోకి చూస్తూ "ఉహూ" బింకంగా జవాబిచ్చాడు రంగనాథ్.

"ఎందుకని ?"....

"అదంతే.... పెళ్ళి చేసుకోవాలను కొంటున్నాను...."

"బావుంది.... పెళ్ళి చేసుకోవాలనుకొంటే.... మనిషికి మనిషి తోడై ఖర్చులు కాదా ? పెద్దచదువు చదివితే .... మంచి ఉద్యోగం వస్తుంది కద ?"

"ఆలోచన బాగానే వుంది.... కానీ .... ఆచరణే కష్టంగా వుంది...." కొంటెగా నవ్వుతూ జానకి కళ్ళలోకి సూటిగా చూశాడు రంగనాథ్.

ఆ నవ్వు జానకి ఎదలో గుచ్చుకుంది.... అప్రస్తుత ప్రసంగం చేయలేదుకదా తను అని లోనికి వెళ్ళిపోయింది.

జానకి తల్లి ఆరోగ్యం నానాటికే తీసికట్టు అవసాగింది.... జానకికి ఇంటి బాధ్యతలు మరింత చుట్టుకున్నాయి. చదువు వెనకబడింది.... రంగనాథ్‌కు పార్ట్‌టైమ్ ఉద్యోగం దొరికింది.

ప్రత్యేక శ్రద్ధతీసుకొని జానకికి తెలియని పాఠాలు చెప్పాడు రంగనాథ్. జానకి పరీక్షలు పూర్తయ్యాయి.

కృతజ్ఞతలు చెప్పుకుందుకు రంగనాథ్ గదిముందు నుంచుంది జానకి

"జానకీ...." పిల్చాడు రంగనాథ్.... అతడి పిలుపులో ఏదో క్రొత్తదనం....

తలెత్తి ఆశ్చర్యంగా చూసింది జానకి. అతడి కళ్ళల్లో ఏదో తెలియని భావం....

"జానీ.... నేనంటే నీకిష్టమేనా ?"

"కాదని ఎవరన్నారు ?"

"అయితే నన్ను పెళ్ళి చేసుకుంటావా ?"

"పెళ్ళా....?" కళ్ళు విస్ఫారితాలయ్యాయి.

"ఏం.... తప్పా ?"

"కాదు.... మన కులాలు కలవ్వు. .... నాన్నగారొప్పుకోరు...." బేలగా అడమనసు బైటపెట్టేసింది.

"కులాల మాట వదిలేయ్.... నాన్నగారి ప్రసక్తి తేకు.... నీవు.... ఊ.... అంటే ఎట్లైనా దూరంగా వెళ్ళిపోయి పెళ్ళిచేసుకుందాం !"

"ఉహూ.... నావల్ల కాదు"

"జానీ.... నిన్ను వదలి వుండ లేనోయ్ ... కాస్త ఆలోచించు.... మనవాళ్లు మన పెళ్ళికి ఎలాగో వొప్పు కోరు కాబట్టి చెప్పి ప్రయోజనం లేదు .... మన మనసులు కలిసినప్పుడు... ఈ భయాలు దేనికి ? చెప్పు జానకీ.... నీవు కాదంటే.... నేనిలాగే జీవితాంతం పెళ్ళి పెడాకుల్లేకుండా ఇక్కడే ఈ గదిలోనే వుండిపోతాను"

"వద్దు" - అప్రయత్నంగా అంది జానకి.

"మ రెతే ..."

"తొందరలేదు.... బాగా ఆలోచించి ఓ నిర్ణయానికి రా జానకీ.... ఎటైనా వెళ్ళిపోయి పెళ్ళిచేసుకుందాం ? చిలుకా గోరింకల్లా హాయిగా బ్రతుకుదాం ..."

మౌనంగా ఇంట్లోకి వచ్చేసింది జానకి....

నెల తిరిగేసరికి జానకి రంగనాథ్ తో ఇంటినుండీ వెళ్ళి పోయేంత ధైర్యాన్ని కూడ గట్టుకుంది.

ఇద్దరూ కాకినాడ వెళ్ళిపోయారు....

హొటలు భోజనం.... సినీమాలు .... సరదాలు.... రోజులు .... ....







శరవేగంగా దొర్లుతూంటే,.... పెళ్ళి మాటే గుర్తురాలేదు.... వారికి....

చేతిలో.... డబ్బు తరిగిపోతోంది. ఉద్యోగ ప్రయత్నంలో రాజమండ్రికి మకాం మారింది.... భుక్తికోసం తంటాలు పడ్డంలో పెళ్ళిమాట వెనుక పడిపోయింది.

పగలంతా ఉద్యోగాన్వేషణలో అలసిపోయి గదిచేరుకున్న రంగనాథ్ ను చూస్తూ.... ఉద్యోగం దొరక లేదా అని అడగాలంటే జానకికి అభి మానం అడ్డొచ్చింది.. అడపాదడపా కస్సు బుస్సు లాడేవాడు .... గుడ్లనీరు కుక్కుకొని కరకర లాడే పొట్టూ ఇన్ని మంచినీళ్ళు పట్టించి పడుకొనేది జానకి.

తనూ ఎక్కడైనా ఉద్యోగం కోసం ప్రయత్నిస్తే.... అమ్మో.... రంగనాథ్ ఒప్పుకుంటాడా ?.... ఒప్పుకోకేం చేస్తాడు ? నిలకడలేని ఆలోచనలతో గడిచిపోయేది....

"ఉదయమే ఎవరో ఆఫీసువాళ్లు కనపడమన్నారు... ఈరోజు కాస్త హెూప్ వుంది.... మరివెళ్లిరానా" అని చెప్పి వీధిలోకెళ్లిన రంగనాథ్ .... ఇంటికి తిరిగిరాలేదు.... ఆరోజు జానకి ఎదురుచూచి, చూచి మొదట భయం తోటి, తరువాత నిస్పహాయతతోటీ ఏడ్చింది.... రంగనాథ్ జాడ ఆరోజే కాదు.... ఆ తరువాత వారం రోజులు గడిచినా తెలియలేదు. మోసపోయా నంటూ లోలోనే కుమిలి కుమిలి ఏడ్చింది.... ప్రేమలోపడ్డ ప్రతి ఆడపిల్ల లాగే తనూ మోసానికి బలి అయి పోయిందా ? తలుచుకొంటేనే విగురా కులా అల్లల్లాడిపోయింది.

ఊరు క్రొత్త.... ఎటు వెళ్లాలి ? ఎవరిని వాకబు చేయాలి ?... ఆలోచ నలతో సతమతమౌతూ.... గదిలోనే తలుపులు బిగించుకు కూర్చుంటే ఇల్లు గలావిడ, "అబ్బాయి ఎక్కడి కెళ్లాడు ?.... రాలేదే".... అంటూ అనుమానపు దృక్కులతో ఆరాలు తీస్తూంటే.... ఏమి చెప్పడానికీ తోచక ...."అర్జెంటు పనిమీద ఇంటికెళ్లారండీ .... నన్ను రమ్మని ఉత్తరం వ్రాశారు" అని బొంకి.... ముక్కు పుడక అమ్మి, విజయవాడ బండెక్కింది జానకి.

తన స్వగ్రామం గుడివాడ అని చెప్పిన గుర్తుమినహా, ఇతరత్రా వివ రాలు ఎరుగదు జానకి.... తానేం చేస్తూందో.... ఎక్కడి కెళుతూందో, దేనికోసం వెళుతూందో ?.... తెలియని ఓ అయోమయ స్థితిలో.... గుడివాడ స్టేషనులోబండి దిగేసరికి బాగా ప్రొద్దు పోయింది. అక్కడ దిగాకగానీ.... తానున్న స్థితి అర్థం అవలేదు.... ఎటు పోవాలో ఏంచేయాలో తోచక అక్కడే స్టేషనులో జనాలమధ్య కూర్చుంది జానకి.

విజయవాడ వైపు వెళ్ళే బండికోసం కూర్చున్న మనుష్యుల రద్దీ ఎక్కువగా వుంది. గడబిడ మాట్లాడుకొంటూంటే తనో అరుగుమీద పిట్ట చూపుల్తో కూర్చుంది జానకి.... అందరూ స్థిమి తంగా వున్నారు. ఎవరికీ ఏబాధాలేదు.. అందరి ముఖాల్లో నిశ్చింత.... మరి తను మాత్రం... కళ్ళలో నీటిపొరలు

.... పమిటతో కళ్ళువొత్తుకొని తలెత్తి చూచింది. అల్లంత దూరాన వోవర్ బ్రిడ్జినానుకొని హిప్పీ క్రాపులతో బెల్ బాటమ్ పేంట్లతో ఇద్దరబ్బాయిలు తదేకంగా తననే చూస్తూండడం చూచి లోలోపలే బెదిరిపోయింది జానకి....

మధ్య మధ్య కబుర్లు చెప్పుకొంటూ వంకరగా నవ్వడం చూస్తుంటే కంగారుగా వుంది. అయినా బింకంగా కూర్చుంది. ఒంటరి ఆడపిల్లకు వీధిలో ఎంత గౌరవమో తొలిసారిగా తెలుసుకుంది జానకి.

విజయవాడ వెళ్ళే పేసింజరురావడంతో అప్పటిదాకా కబుర్లతో కాలక్షేపం చేసిన పేసింజర్లంతా తట్టాబుట్టా పట్టుకొని పెట్టెలకేసి పరుగెట్టారు.... ఒక్క క్షణం తను ఒంటరిగా నిలబడిపోయిన జానకి చుట్టూ కలియచూచి.... ఎవరో తరుముస్తుకొన్నట్టే.... ఓవర్ బ్రిడ్జిఎక్కి అవలి ప్లాట్ ఫామ్‌లో దిగి .... స్టేషను లోంచి బయటికొచ్చింది.

స్టేషను కాకుండా .... ఆరాత్రికి కుటుంబీకుల పంచలో తలదాచుకొని ఉదయాన్నలేచి వెళ్ళొచ్చని. ఆ పరిస్థితి

లో. అదే క్షేమకరమని మనసులో ఏ మూలనో వివేకం హెచ్చరించింది. చేతిలో చిన్న చేతిసంచి మాత్రమే వుంది.

అప్పటికే ఊరంతా మటుమణగి వుంది. వీధిలో ఒకటీ అరా రిక్షాలు ఎదురొస్తున్నాయి. ఈ నిశీధిలో, ఎవరి పంచచేరాలి .... ఏమని చెప్పుకోవాలి ? .... భగవాన్.... తనెంతటి అనాలోచితమైన ఆలోచనకు తావిచ్చింది ? క్షణకాలం నిలబడి ఎటూ తేల్చుకోలేక సతమతమైంది ....

తన వెనకాల .... కూతలే కాదు, దూరంలో ఇందాకటి వెకిలి నవ్వులు, భయంగా తలతిప్పి చూసింది ... ఆ ఇద్దరు కుర్రాళ్లు .... తన్ను వెంబడిస్తున్నారు .... సందేహంలేదు .... ఆలోచనలు స్తంభించాయి. మెదడు మొద్దుబారింది. తెలియని కంగారు .... ఏదో మొండితనం .... ప్రాణాల కోసం తెగించి పరుగులెట్టింది. సందులు గొందులు తిరిగినా ఏ గుమ్మమూ తెరవిలేదు. భయంతో ప్రాణాలు కడగట్టి పోతూంటే.... అలసటతో శరీరం కంపిస్తూంది.... తెరలు వుంచిన గుమ్మంలో పరుచుకున్న కాంతి అవుపించగానే .... అయిందేదో అయింది లెమ్మని .... ఇంట్లోకి వచ్చి పడింది .... జానకి ...

"ఆ తరువాత కథ మీకు తెలుసు" అంది - దుఃఖంతో కంఠం పూడుకుపోతుంటే.

జానకి కళ్లు శ్రావణ మేఘాల్లా వర్షిస్తున్నాయి. ఎదంతా తడిచిపోయింది.

సాలోచనగా తల పంకించాడు సారథి.

"నా అదృష్టం పండి ఈ దేవుడి పంచలో పడ్డాను కాబట్టి సరిపోయింది. లేకపోతే ...." భయంతో గజగజలాడింది జానకి. "డాక్టరుగారూ .... తల్లిచాటుపిల్లనునమ్మించి బైటకు తీసుకొచ్చి .... నడివీధిలో వదిలేసి .... అర్ధాంతరంగా మాయమైన వ్యక్తి.... జీవితంలో ఏనాడైనా తారసపడితే ఆ ఆడపిల్ల మనసు ఎలా వుంటుంది చెప్పండి ? .... ఆ వ్యక్తికి .... ఏ ముఖంతో సేవ చేయగలదు చెప్పండి ? .... అసలుసేవ చేయాల్సిన అవసరం వుందంటారా ? .... అసలా ముఖాన్ని కన్నెత్తిచూడాల్సిన పనేలేదు కదా? ఒక్కో ప్రశ్నే సూటిగా వేస్తూంది జానకి. కళ్లు మూసుకున్నాడు సారథి.

ఉదయం మొండిగా జవాబిచ్చిన జానకి ముఖం కళ్లముందు కదులాడింది.

ఆ అమ్మాయి కంఠంలో అభిమానం. వంచింపబడి గాయపడ్డ మనసు ఎంతటి వేదన ననుభవిస్తోందో సుస్పష్టంగా అర్థంమౌతోంది.

చాలాసేపు మౌనంగా వుండిపోయాడు సారథి.

తలవంచుకొని ముక్కు, ముఖాన్ని పమిటతో గటిగా తుడుచుకొంది.

జ్ఞానకి.... గుండెలు యింకా ఎగసి పడుతున్నాయి.

“జానకీ”.... పిలిచాడు సారధి.

“యవ్వనం పాల పొంగు లాటిది. వొడ్డులను ఒరసుకొని ప్రవహించేనది లాటిది యవ్వనము .... యవ్వనంలో అదోలాటి పిచ్చెత్తించే స్వభావానికి లోనై మంచిచెడు విచక్షణ కోల్పోతారు యువతీ యువకులు. ప్రణయ భావాల ముందు మానవుడు అసహాయుడు .... ఒక్కోసారి అసమర్థుడు అవుతాడు. అనాదిగా ఈ భావం, ఎంతో మంది స్త్రీ పురుషుల జీవితాన్ని - జీవిత నాటకాన్ని దుఃఖమయం చేసింది ....చేస్తూంది.

“అంతర్వాహినిలా అందరి హృదయాలలో ప్రవహిస్తూ ఆర్ద్రత నింపే ఈ ప్రేమ స్వరూపం ఎవరికి తెలియదు .... తెలుసుకోవడంలో ఎవరూ కృత కృత్యులు కానూ లేరు .... ఇందులో నీవు తప్పు చేశావని నేనను కోను .... కానీ .... జానకీ ఒక్క విషయం గుర్తుంచుకో .... రాగ ద్వేషాలు మానవుని నైజ గుణాలు .... అనురాగాన్ని అంటి పెట్టుకొని ద్వేషం, ద్వేషాన్ని అంటి పెట్టుకొని రాగం వుంటాయి.... అన్నిటినీ మించి







నది మానవత్వం .... జ్వాజ్వల్యంగా వెలుగుతూ మానవుడిని జీవిత పథంలో నడిపించేది మానవత్వం .... మానవత్వం లేనిరోజు మనుగడేలేదు .... అది జీవితమే కాదు. చంపదగిన శత్రువైనా చేజిక్కినపుడు.... కీడుచేయ కుండా వదలివేయడం ఆపద్ధర్మం. ఇంకా చేతనైతే మేలుచేసి .... వెళ్ళి పొమ్మని చెప్పాలి....

"గాలి పాటుగా నీ గుమ్మంలోకి వచ్చిపడ్డాడు రంగనాథ్.... ఈరోజు అవకాశం నీది ; నీలోని మానవత్వమనే జ్యోతిని ఆరనీకు.... ఆపద్ధర్మాని మర్చిపోవద్దు" - చెప్పడం ఆపి, అలసటగా కళ్లు మూసుకున్నాడు సారధి.

మానుడుపట్టిన గాయం రంగనాథ్ దర్శనంతో రేగి.... సలపడం మొదలుపెట్టింది.... తోడు.... సారధి చెప్పే హితవాక్యాలు అభిరుచి కలిగిస్తూంటే అణుచుకోలేని బాధతో, వ్యధతో "మీకేం ఎన్నయినా చెప్ప గలరు ? అనుభవించినదానికి.... నాకు తెలుస్తుంది..... అంత ఔదార్యం నాకు లేదు.... నా స్థి మౌతుంది" - హిస్టరికల్‌గా ఏడుస్తూ విసురుగా లేచి వెళ్లిపోయింది జానకి.

దీర్ఘంగా నిశ్వసించి చాలాసేపు ఇంటికప్పుకేసి చూస్తూ అలాగే కదల కుండా కూర్చుండిపోయాడు సారధి.

తరువాత నెమ్మదిగా లేచి, రోగి దగ్గిరకు వెళ్ళి, శరీరం తాకి చూచాడు. జ్వరం విడుస్తున్నదానికి సూచనగా ఒళ్ళంతా చెమటలుపట్టి వున్నాయి.

"గుడ్" మనసులోనే అనుకొని.... హాల్లోకి వచ్చాడు.

మసక వెలుతురులో చాపమీద పడుకొని ఇంకా వెక్కి వెక్కి ఏడుస్తూంది జానకి.

అల్మేరా తెరచి, రెండు మాత్రలు తీసుకొని, కూజాలో నీళ్ల గ్లాసులో వొంపుకొని, చాపదగ్గర వెళ్ళి ముంగాళ్ళమీద కూర్చొని, "జానకీ" అని పిల్చాడు సారధి.... ఆ గొంతులో

"జానకీ .... లే.... ఈ మాత్రలు వేసుకో.... యూ నీడ్ సమ్ స్లీప్.... లే.... అనునయంగా పిల్చాడు .....

లేచికూర్చొని చేయిచాపింది. మాత్రలు గొంతులో వేసుకొని నీళ్లు తాగింది. ఖాళీగ్లాసు అందుకొని మృదువుగా తల నిమిరి.... "నిద్రపో... అలసిపోయి వున్నావు" అంటూ లేచాడు సారధి.

వీధి తలుపు గడియవేసి, వరాండాలో కూర్చున్నాడు. అర్ధరాత్రివేళ.... శీతలపవనాలు స్వేచ్ఛా విహారం చేస్తున్నాయి. మింట చుక్కలు పకపక లాడుతున్నాయి. నిశీధిలో ప్రకృతి విశ్రాంతి ననుభవిస్తూంది.

మనసంతా "ఇది" అని తెలియని అవేదన చుట్టుముట్టి వేధిస్తూంటే, అక్కడే మరో అరగంట కూర్చుండిపోయాడు.

(ఇంకా వుంది

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కె యన్ కేసరి



'గృహలక్ష్మి' కంకణ గ్రహీతలైన తెలుగు వనితలు ఈనాడు ఎందరో ఉన్నారు. 'గృహలక్ష్మి' పత్రిక ద్వారా స్త్రీ జనాభ్యుదయానికై కేసరిగారు చేసిన అద్వితీయ కృషి తెలుగువారు మరువలేనిది. అలాగే కేసరీ కుటీరం, కేసరీ విద్యాలయం వంటివి, ఆయన పేరు చిరస్థాయిగా నిలిపే సంస్థలు. ఆత్మబలం, స్వయంకృషి అచంచల దీక్షతో, వైద్య శాస్త్రంలోని ప్రతిభను ప్రజోపకరంగా మార్చి, సేవా తత్పరతతో చరితార్థులైన కేసరిగారు తమ జ్ఞాపకాలను పుస్తకరూపంలో 1953 లో వెలువరించారు. ఆదర్శ ప్రాయులు, పుణ్యజీవనులు అయిన ఆ మహానుభావుని జీవిత విశేషాలు ఆనాటి సాంఘిక పరిస్థితులకి దర్పణం వంటి అనుభవాలు జులై నెల నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాము.

కొజాల ఆటపాటలు కొంత వెక్కసముగునున్నను పలువురు సామాన్యుల కానందదాయకమైయుండెడివి. కండ్లకు సుర్మా, పండకు దాసిన, కొప్పునపూలు ధరించి, నడుమునకు పావడగట్టుకొని కులుకుచూ, నవ్వుచూ పురుషులతో సరసములాడుచు, మొగమొక్కట్లు, ఆడుచందములుగల వీరు హాస్యనిలయములై యుందురు. ఇద్దరు ఎరుకలస్త్రీలు తాటాకుగిలకలను అమ్ముకొనుచు, వీధులలో మూతులు పొడుచుకొనుచు సవతులు జగడమాడు దృశ్యమునుచూపి, చూపరులను వినోదపరచి బియ్యం మడుగుకొనేవారు. గారడివిద్యలను, దొమ్మరి ఆటలను మద్రాసు నడివీధులలో చూపి, బిచ్చమెత్తువారు కొందరు వచ్చుచుండిరి. పగటివేషములు వేసుకొని మోటహాస్యమును చెప్పుచు బిచ్చమునకు వచ్చువారును కన్పించుచుండిరి. అప్పుడప్పుడు ఆంధ్రదేశమునుండి మరుగుజ్జు వస్తాదులు కొందరువచ్చి కట్టులు కత్తులు త్రిప్పుచూ సాముగరడీలను చేసిచూపి బిచ్చము అడిగేవారు. ఒక జంగం భద్రప్ప పెద్దగంటను చేతపట్టుకొని, మరియొకచేత ఆ గంట అంచును పుల్లతోచుట్టుచుండగా గంటనాలుక గణగణ కొట్టుకొను దృశ్యముచూడ చిత్రముగా నుండెడిది. ఒక తెలుగుబిచ్చగాడు బొద్దికూర అమ్మను - "బొద్దికూరతిన్నవారు బుద్ధిమంతులు అగుదురు; చక్కిలాలు తిన్నవారు చచ్చిపోదురు" - అనే పాటపాడుకొంటూ తిరిగేవాడు. అతడు యతి కొరకట్లన్నాడే గాని ఇది వాస్తవము కాదు. కాలిమీద మాంసంతునకను పెట్టి కట్టుకట్టుకొని పరుండి లేవలేనట్లు అభినయించు బూటకపు బిచ్చగాండ్లను మరి అనేక కృత్రిమ బిచ్చగాండ్లను అప్పటినుండి యిప్పటివరకు ముక్కోటి యేకాదశినాడు మద్రాసు దేవాలయములలో చూచుచునేయున్నాను.

## శవవాహకులు

మద్రాసులో పీనుగలనుమోయు వృత్తి నవలంబించిన వారి జట్టులు గలవు. అందరికివలెనే వారికిని ఒక సమితిగలదు. ఈ సమాజము వారందరు యెందుకు పనికిరాక కడపట పీనుగులమోయు వృత్తిలో చేరినవారు. వీరు మద్రాసులో అక్కడక్కడ నిర్ణయస్థలములలో నిలుచుకొని పిలుపులకు నిరీక్షించుచుందురు. కర్మకాండను జరిపించు పౌరోహితుడు పోయి ఒక జట్టును, చచ్చినవారింటికి పిలుచుకొనివచ్చును. ఈ పౌరోహితునకు వీరందరు పరిచయస్తులే. వచ్చినవాహకులు చచ్చినవారినిచూచి బేరము పెట్టెదరు. ధనవంతుడై లావుగనుండిన వాహకుల పంటపండినదే. ఒక జట్టువచ్చినచోటికి మరియొక జట్టు రాకూడదను కట్టుబాటు వీరికి గలదు. ఈవాహకులు అడిగినంతడబ్బు యివ్వలేకపోయినను వారిని పిలుచుకవచ్చిన పౌరోహితుడు తీర్మా

నించిన ప్రకారము వారు సమ్మతించి శవమును లేవదీసుకొనిపోయెదరు. ఈ పౌరోహితుని దయ వీరికి కావలసియుండును. వీరికిందులో కమీషనుకూడ వున్నది.

ఈ దేశమునయున్న మిగత అన్నిపద్ధతులకంటె శవమును దహనము చేయుటయే మంచిపద్ధతియని ఇప్పుడు పాశ్చాత్యులు, నాజూకైనపద్ధతి నొకదానిని కనిపెట్టిరి. ఒక పెట్టెలో శవమునుంచి తలుపునుమూసి ఎలక్ట్రిక్‌స్విచ్చిని వేసిన అరనిమిషములో శవము భస్మమైపోవునట. ఈపద్ధతి మనదేశములోను అమలునందుంచిన ప్రజల కష్టములు పోగలవు.

## కాఫీ క్లబ్బులు

పూర్వము మద్రాసులో కాఫీక్లబ్బులు చెప్పతగినవి లేవనియే చెప్ప వలయును. నేను క్రొత్తగ మద్రాసుకు వచ్చినప్పుడు అక్కడక్కడ చిన్నయిండ్ల లోను వరాండాలలోను వెదురుతడికలను అడ్డముకట్టి మామిడిపలకలను బెంచీలను వేసి బ్రాహ్మణులకు లోపలను, తదితరులకు వెలుపలను కూర్చుండుటకు యేర్పాటుచేసి యుండేవారు. అప్పుడు వారిచ్చుచుండిన కాపీ పేరునకు కాఫీగాని కాఫీవాసనకూడ లేకుండెను. ఆ కాపీని మురికిలోటాలలో పోసి యిచ్చుచుండిరి. వడలు, దోసెలు, మురుకులు, పులిహోర, పెరుగుఅన్నము, పెరుగువడలు మొదలగు ఫలహారములను యెండుటాకులలో పెట్టి యిచ్చుచుండిరి. దాహము కావలసియుండినవారు లోటాతో కొళాయిలో నీరుపట్టుకొని త్రాగవలసెనదే. నేను ఒకనాడు కొత్వాలుచావడికి సమీపముననుండు ఆదియప్ప నాయనివీధిలో పోవుచుండగా యొకయింటిముందర కాఫీక్లబ్బుబోర్డును చూచితిని. ఆ బోర్డుక్రింద ఇక్కడ "తిరుపణ్ణారము" అమ్మబడునని వ్రాసి వుండెను. ఆ తిరుపణ్ణారమను స్పెషలు ఫలహారము యేమో రుచిచూడ వలయుననే ఆశతో క్లబ్బులోపలికిపోయి ఒక తిరుపణ్ణారమును యివ్వుమని అడిగితిని. అప్పుడాయన నూనెకంపుకొట్టుచుండిన గారెను తెచ్చియిచ్చెను. దాని వెల కాణి యని చెప్పెను. ఆ వడను యెండుఆకులో పెట్టి మడిచి నూలునుచుట్టి నా చేతులో పెట్టెను. ఈ తిరుపణ్ణారమును తుంచి నోటిలో వేసుకొని రుచిచూచితిని. అది పాసినకంపు, నూనెకంపు కొట్టినందున వెంటనే వీధిలో పడవేసితిని. ఈ క్లబ్బులను నడుపువారు ఆ కాలమున వైష్ణవులుగ నుండిరి. ఇది అప్పటి కాఫీ

# పాత బండు

ఆ కాలమున చెన్నపట్నమున గుఱ్ఱములనుకట్టు పెట్టెబండ్లు ఉండేవి. ఇవి కూర్చుండుటకు చాలా అసౌకర్యముగా ఉండేవి. ఆ పెట్టెజట్కాలు క్రమంగా మారి, నేటి గూడుజట్కాలు అయినవి. వీటిని వేలూరుజట్కాలు అని అప్పుడు అనేవారు. ఆ కాలపు జట్కాలలో కూర్చుండిన ముందువారు వెనుక వారిమీద పడునట్లు ఏటవాలుగా నుండెడివి. ఈ పెట్టెబండ్లు, రెండెద్దుల బండ్లున్నూ ఉండేవి.

నాటికి నేటికి మారనివి వంటెద్దు గూడుబండి, రేఖలాబండి. 'రేఖలా' అనగా రెండు తేలికైన చిన్నచక్రములు కలిగియుండును. ఇరుసుపైన ఒక్కరు కూర్చుండుటకు తగిన ఆసనము అమర్చబడియుండును. ఒక్కొక్కప్పుడు ఆ చిన్న సీటుమీదనే, ముందువైపు తిరిగికూర్చుండి బండితోలువాని వీపునకు వీపునానించి పిల్లకాయలు కూర్చుండేవారు. దీనికి అందమైన పుంగనూరు పొట్టిఎద్దును కట్టుదురు. బండి తేలిక, ఎద్దు చురుకైనది. తోలేవాని చలాకీ కొద్దీ ఈబండి అతి వేగముగా పోవును. అప్పుడు తరచు రేఖలాబండ్ల పందెములు జరుగుచుండేవి. ఈబండి వేగముగా పోవుచున్నపుడు దానిపై పిల్లకాయకూడా కూర్చుండియున్నట్లయితే వాడతిభయముతో సీటును ఊలకరుచుకొని యుండేవారు.

ఇవిగాక ఆరోజులలో మూడచక్రముల వింతబండ్లుండేవి. వానిని మూడుచక్రముల త్రోపుడుబండ్లు అనేవారు. ఈ బండ్లు ఆరోజులలో విస్తారముగ మధ్యతరగతివారి వద్ద ఉండేవి. గుఱ్ఱపుబండ్ల నుంచుకోగలిగిన పెద్ద గృహస్థులుకూడ చిన్నసవారీలకు ఈ బండ్లనుంచుకొనేవారు ; మార్కెట్టుసవారీకీ, రాత్రిసవారీకి ఈ బండ్లనుపయోగించేవారు. ఈ బండీ ముందుండు మూడవ చిన్నచక్రమునకు పడవచుక్కానివంటి దొకటి అమర్చబడియుండును. బండిలో కూర్చున్న పెద్దమనిషి ఆ చుక్కాని చేబట్టి ఆ ముందు చక్రమును త్రిప్పుకొనుచుండును. బండిసాగుటకు వెనుకనుండి బోయీయొకడు బండినెట్టును. సవారి చేయు పెద్దమనిషి భారీఅయినవాడైన ఇదరు తోసేవాండ్రుందురు. ఆ కాలమున మద్రాసులో ధనవంతులు పురుషులును చేతికి బంగారపు మురుగులు, గొలుసులుకూడ పెట్టుకొనేవారు. ఈమురుగు, గొలుసులు నలుగురుకి కనబడుటకై బొక్కాయిచేతులను పొట్టిగా కుట్టించుకొనేవారు. ఇవి ఎంతలావుగ నుండిన అంతధనవంతుడని గొప్ప. ఆకాలమున చెన్నపట్నములో సమీపస్థమగు ఆరణి, పొన్నేరి గ్రామముల చలవయన్న ప్రసిద్ధి. ఆరోజులలో విస్తారము

వాడుకలోనుండిన చాకులెట్ బొద్దంచుపంచలను ఈఅరణివాకళ్లు అంచుముడత పడకుండ నేర్పుగా చలవచేసేవారు. మరియు నాకాలపు పురుషులును తెల్లరాళ్ల అంటుజోళ్లు, కమ్మలంతేసివి, పెట్టుకొనేవారు. ఆనాటి చెన్నపట్నపు తెలుగు నాయుళ్లు, శెట్లు, ఆరణివలవ చాకొలెట్ బొంద్దంచుపంచ గట్టి, మురుగులు, గొలుసులు కన్పించునట్లు పొట్టిచొక్కాతొడిగి, తెల్లరాళ్ల అంటుజోళ్లు పెట్టుకొని ముఖమున తిరుమణి శ్రీ చూర్ణములుధరించి ఆ మూడుచక్రాల త్రోపుడుబండిలో సవారిచేయుచున్న నాటిదృశ్యమును నే నెన్నటికిని మరువజాలను.

ఇట్లుండగా మొట్టమొదటవచ్చిన కొత్తరకపుబండి మద్రాసుకోచి (Madras Coach). దానితరువాత బ్యూహామ్ అనే పెట్టెబండి వచ్చినది. దాని వెంట బొంబాయికోచి (Bombay Coach), ఫీటన్ (Pheaton) లాండో, లాండో లెట్, డాకార్ట్ అనే మరి కొన్ని రెండుచక్రములు, నాలుగు చక్రములు గల గుర్రపుబండ్లు వరుసగా రాసాగినవి. ఆ పిదప ట్రాము, మోటారు కారు వచ్చినవి.

నేను మొట్టమొదట మద్రాసుకోచిని వాడుచుంటిని. ఆ పిదప బొంబాయికోచిని వాడితిని. ఆతర్వాత క్రమముగా ఫీటన్, లాండోలెట్, లాండోబండ్లను వాడియుంటిని. ఆమధ్యకాలమందు వేలూరుజట్కాను ఉపయోగించితిని. కొన్నాళ్లు జోడుగుర్రములబండిలో సవారిచేయుచుంటిని. మద్రాసునకు అప్పుడప్పుడు వచ్చుచుండిన ఆస్ట్రేలియన్ గుర్రములను పెగుపోనీలను మంచిలక్షణములుగల వానినిగా కొని, కొంతకాలము నావద్ద యుంచుకొని పిమ్మట మంచి ధరచూచి అమ్ముచుంటిని.

## మద్రాసులో మంచినీరు

నేడు (1949) మద్రాసులో సుమారు 16 లక్షల జనమున్నారన వచ్చును. ఈ 1949 ఫిబ్రవరి 1వ తేదినుండి 160 లక్షల గాలన్ల నీళ్లను మాత్రమే ప్రతిరోజు కార్పొరేషనువారు సప్లయి చేయగలిగిరి. అనగా తల 1 కి 10 గాలన్లు లేక 2½ కిర్సనాయిల్ డబ్బాలనీరు మాత్రమే. మద్రాసులో నేడు ఎక్కడచూచినను నీటిఎద్దడి కబుర్లే. అయితే ఈస్థితి ఇటీవల జనము హెచ్చుటచేత కలిగిన కొత్తసమస్యకాదు. ఇది మద్రాసు పుట్టిననాటనుండియు ఉన్నదే. 1718 లోనే "కోటకు మైలులోపల త్రాగుటకు నీరుదొరకదు" - అని యొక పాశ్చాత్యుడు వ్రాసియున్నాడు. ఆ రోజులలో పెద్దినాయునిపేట

"Father, is it true that Seeta tried her best to persuade Rama not to pick up quarrel with Rakshasas?"

"Yes, she did. And she pleaded, 'Rama, why do you harm those that are not coming in our way? It is a dispute between the hermits and the Rakshasas. Why need we poke our nose into it?"

"Like any sensible woman she offered her advice but your Avatara Purusha had designs of creating a new world order," said Raghu.

"Rama never considered himself as an Avatar - later generations hailed him as such. He simply obeyed the edicts of Dharma. World Order is a political dream but Dharma is a manifestation of eternal values in the earthly sphere ... While completely concurring with Seeta's opinion on the matter, he said. 'Though banished, as a ruler and as a kshatriya, I have the sacred duty of protecting these hermitages from the pillage of vandals. These ashrams are places of purity, piety and peacefulness - abodes of learning and wisdom. Anyone who tries to disturb this balance in nature, this harmony between the mundane and higher order of life, deserves to be punished and as a king, I have that painful duty to perform' ... Seeta looked into his eyes with deep admiration - she had nothing more to say."

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*

ఉత్తరభాగముననున్న బావులనీటిని ఎద్దులపై సిద్దెలతోతెచ్చి అమ్మేవారు. 2 దుడ్డులకు ఒక్కబిందెడు నీళ్లు అమ్మేవారు. దుడ్డు అనగా 5 రాగికాసులు లేక 2 పైసలు. ఈనీరు చాల చల్లగాను, హితవుగాను ఉండేవట. సెంట్ థామస్ మౌంటులో దొరుకు నీరువలె ఉండేవని ఆరోజులలో ప్రతీతి.

## ఏడు బావులు

క్రమతః జనాభివృద్ధి అయినది. 1770 ప్రాంతంలో నీటిఎద్దడివల్ల ఊరిలో కలరా జాడ్యము చెలరేగినది. 1772 లో పెద్దనాయకుని పేటలో ఉండే 7 బావులనుండి రెండుమైళ్లు దూరమున్న కోటకు (సముద్రమున కొక్కమైలుదూరము) మంచినీరు సప్లయిచేసే స్కీము నేర్పాటుచేసిరి.

నిజమునకివి 10 బావులు. ఈ బావులన్నియు 16 అ॥ ల మధ్య కొలతగలవి. 23 మొ 29 అడుగులలోతు. పికోటాలతో నీరుపైకితెచ్చి ఎత్తునగట్టిన తొట్లలో నిలువచేసి, యంత్రసాధనమున వడియగట్టుట కేర్పాటు. అట్లు వడియగట్టిన నీటిని పెద్ద గొట్టములద్వారా కోటలోను వెలుపలను ఉన్న మిలిటరీవారికి నీటిసప్లయి చేయుచుండిరి. ఈ బావులలో నీరు ఎప్పుడూ సమృద్ధే. మరి ఒక్కశతాబ్దమునకుగాని ఎర్రకొండల చెరువు (Red Hills Tank) ఏర్పాటు జరగలేదు. ఆ శతాబ్ద కాలములో నిరంతరం ఈ బావులు నీటిని సప్లయిచేసినా నీరు తరుగలేదు. 1885 లో గాలివానవచ్చి ఎర్రకొండల చెరువువద్ద యంత్రములు చెడిపోయినప్పుడు, 10రోజులు నగరమున చాలమందికి ఈ నీరు సప్లయి అయినది.

1783-87 సం॥ల మధ్య ఈ ఏడుబావుల నీటినే కొళాయిలద్వారా కోటలోను, వెలుపలను మిలిటరీకానివారి ఇండ్లకును సప్లయిచేసిరికాని దీనిని యూరపియనులు, హైందవులునుకూడా ఇష్టపడలేదు. యూరపియనులు బహుశా తమకు నీరుతగ్గునని తలచి యుందురు. హైందవులు, యంత్రము లలో సప్లయిఅయ్యే నీరు వాడుట అనాచారమని ఇష్టపడకుండిరట. పురాతన ముగా, దూరమైనా, తాము తెప్పించుకొనే మంచినీరే తెప్పించుకుని త్రాగుట, తమ దొడ్లలోనుండు బావులలోని నీరే వాడుకొనుట విడువకుండిరి.

నేను మద్రాసునకు వచ్చుటకు ముందుఉన్న పరిస్థితులు దుర్భరముగా ఉండేవట. పట్నం విస్తారంగా పెరిగినది. పరిసరములగల 16 గ్రామ ములుకలసి పట్నమైనది. 1871 జనాభా లెఖలలో (అదియే వాస్తవమైన

మొదటి జనాభాలెఖ) 4 లక్షల దాకా జనాభా కన్పించుచున్నది. నేడందుకు (1949) 3 రెట్లకుపైగా జనాబా పెరిగినది. అయితే శతాబ్దమునాడున్న నీటి వసతే గాని చిరకాలము క్రొత్తవసతి యేమియు యేర్పడలేదు. ఇటీవల ఏర్పడిన పూండీచెరువు స్కీమున్నూ పట్నమున గల జనాభా నీటి కరువును తీర్పజాలకున్నది. ఇక కృష్ణా పెన్నాగు ప్రాజెక్టు స్కీము అమలు జరిగినచో తీరగలదని చెప్పుచున్నారు.

దూరాభారమునుండి నీరు తెచ్చుకోలేనివారు, స్వంతబావులు లేనివారు అయిన పేదసాదలేగాక, అగ్రజాతులవారుకూడా అహారమునకై దేవాలయముల నంటిన చెరువులలోను కోనేళ్లలోను నీరువాడుకొనేవారు. ఆ కోనేట్లోనే బట్టలుతికి, అందే స్నానముచేసి, అందే శుభ్రంగా తోమిన వెండి, రాగి ఇత్తడి బిందెలతో, ఆ నీరే తడిగుడ్డలతో మడిగా ఇంటికి తెచ్చుకొని త్రాగేవారు. ఆ నీరెట్లుండెనో నాటి యగ్జిక్యూటివ్ ఇంజనీయర్ స్టాండిష్ అనే దొర ఇట్లు వర్ణించియున్నాడు.

"దేవాలయములనంటిఉండే చెరువులు కోనేళ్లు మున్నగు జలాశయ ములలో నీరెంతఅపరిశుభ్రమో నేనిటీవలగాని చూడటం తటస్థించలేదు; అనీటినే ముఖ్యముగా అగ్రజాతులవారుతెచ్చి వాడుకుంటున్నారు. కపాలేశ్వరఆ దేవాల యంలో కోనేరున్నది. అందలి నీటిపై పచ్చగా అట్టవలె పాచి పేరుకొన్నది. బహుకల్మషమైన మురుగునీటి కాలువలోకూడ నేనంతటి పాచి పేరుకొనుట చూచియుండలేదు. అయినా ఆ నీటిలో స్నానము చేసేవారున్నూ ఉండేవారు."

ఇట్లుండగా నీటి యెద్దడి తీర్చుటకున్నూ, పరిశుభ్రమైన నీటిని సప్లయి చేయుటకున్నూ, ప్రభుత్వమువారు 1861 నుండి ఆలోచన లారంభించిరి. స్కీములువేసిరి. ఏడుబావులనీరున్నూ పరీక్షచేయించి, అందులోకూడ అపరి శుభ్రతయున్నదని అనుమానించిరి. కడకు ఎర్రకొండల చెరువు, చోళవరం పంటచెరువులు కలిపిన స్కీము 1866 లో అంగీకృతమై ఆ రేండేడ్లలో ముగిసినది. ఆ చెరువునుండి శాస్త్రపద్ధతిని నీరుతెచ్చి కీలుపాకులో సముద్ర మట్టమునకు 44 అడుగుల ఎత్తున ట్యాంకులుకట్టి, నీరు నిల్వచేసి వడియగట్టి, ఊరికి సప్లయిచేయ నారంభించిరి. ఇది 13-5-1872 న గవర్నరు నేపియర్‌చే ప్రారంభింపబడినది.

అనగా నాపుటుకలతో ప్రారంభమైన కొళాయినీరు నేను మద్రాసు వచ్చే టప్పటికి బాగా వ్యాప్తిలోనికి వచ్చినది. కానీ కొళాయిలలో వచ్చేనీరు పరిశుభ్రముగా నుండేది కాదు. నీళ్లతోకూడ చిన్నపురుగులు చేపలు వగైరా జీవములు వచ్చుచుండెను. ఆ కారణమున మద్రాసులోయున్న ధనికులు

కొందరు పేరుపొందిన కొండూరు బావి నీరును (విల్లివాకం), టాకరు సత్రమున నుండు బావి నీరును తెప్పించికొని త్రాగేవారు. ఈ రెండు స్థళములమందు నీరు చాల ఆరోగ్యకరమని అకాలపు డాక్టర్లు చెప్పుచుండిరి. ఈ బావుల నీటిని బ్రాహ్మణులు పీపాయిలలో తీసుకొనివచ్చి కావలసిన వారికి బిందె 1 కి అణావంతున ఇంటింటికి ఇచ్చి పోవుచుండిరి.

1940-41లలో మద్రాసులో నీటి సప్లయి వృద్ధిచేయుటకై ఎర్రరాళ్ల చెరువునకు లీడు పూండి చెరువును చేర్చిరి. కాని ఈలోపల జనము రెండు రెట్లకుమించి పోయినది. కావున ఎండాకాలమున మనిషి 1కి ఒక్క కిరసనాయిలు డబ్బాడు నీళ్లుదొరుకుట దుర్లభమైనది. ఇక ఆలోచనలోనున్న కృష్ణాపెన్నారు ప్రాజక్టుస్కీము అమలు జరిగినచో మద్రాసునకు నీటికరవు ఉండదు అని చెప్పు చున్నారు. కావచ్చును ; కాని అస్కీము ఇంతలో అమలుజరుగునా యనికూడ నా అనుమానము. దీనికి రెండు ప్రతిబంధకము లేర్పడియున్నవి. రామ పాదసాగర ప్రాజక్టు ఏర్పడి గోదావరి నీరు కృష్ణకు వచ్చినగాని ఈ స్కీము అమలుజరుగుటకు తగినంత పుష్కలముగ కృష్ణనుండి పెన్నకునీరు రాజాలదు – అని తెలిసిన వారనుచున్నారు. అయితే జరుగుచున్న యత్నము ఆ రామ పాదసాగరమును వెనుకకునెట్టి ఈ క్రొత్త స్కీము సాగించవలెనని యున్నట్లు కన్పించుచున్నది. రెండవది : ఈ స్కీము అమలు జరిగిన పులివెందల, రాజం పేట తాలూకాలలోని పంటభూములు, పండ్లతోటలు ముంపుఅగునని వారు గోలబెట్టుచున్నారు. (ఆటంకముల నన్నిటినిదాటి ఈ స్కీము త్వరితముగా సాగుచున్నదని తెలియుచున్నది).

శ్రీ వి. డి. కృష్ణస్వామి ఎం.ఏ. (కాంటబ్) గారు ఈ విషయమై చర్చించి 1939లో ఇట్లు వ్రాసియున్నారు :

"కాబట్టి 1639 లో ఆంగ్లేయులిక్కడ నివాసమేర్పరచుకొనుట కేవలము గుడ్డితనము ; ఏలనంటే నాటినుండి నేటివరకు నీటికొరకు దేవులాడడంతప్ప, ఈ సమస్యపరిష్కారమయ్యే సాధనమింకా కన్పించలేదు. 1949 లోను అదే పరిస్థితులలోనున్నాము."

మద్రాసు నగర మధ్యమున కూవము అని యొక నది పారుచున్నది. అది దుర్గంధమును వెదజల్లుటకుతప్ప మరెందుకు పనికిరాదు. నేను ఇచ్చటికి వచ్చినదిమొదలు, ఎన్నియో మార్పులు చెందినవి. కాని ఏమాత్రము మార్పు చెందనివి మూడు : కొళాయిలలో అపరిశుభ్రమైనీరు ; కూవమునది దుర్గంధము ; దేవాలయపు కోనేళ్లలో పేరుకొన్నపాచి, వీనికెప్పటికైన మార్పువచ్చునో, రాదో ?

# 9. నాటి చెన్నపట్నంలో

## వీధులు, పేటలు, కట్టడములు చీనాబజారు

పూర్వము చైనాదేశమునుండి వచ్చుచుండిన తెల్లకాకితములను చైనా కాకితములనుచుండిరి. ఆ కాకితములను విక్రయించు అంగళ్ల వీధికి చైనా బజారు అనే పేరు ఇప్పటికిని వాడుకలోనున్నది. ఇటీవల దానినే నేతాజీ సుభాష చంద్రబోసు పేరట పిలుచుచున్నారని వింటిని. ఎస్ప్లనేడు ఈ వీధిలో నొక భాగము.

### బందరు వీధి

బందరునుండి కొందరు అద్దకపు చీరలను తెప్పించి అమ్ముచుండిరి. ఈ వ్యాపారము చేయువారుకూడా బందరు, నెల్లూరు, కరేడు, ఇనమన మెళ్లూరు మొదలైన ఊళ్లనుండి వచ్చిన రంగిరీజులు; తెలుగువారు. అందుచేతనే దీనిని బందరువీధి అనిరి. ఆకాలమున పాలచంగావిదోవతులు, చీరలు నాజూకు గనుక స్త్రీలు పురుషులు వాటిని ధరించుచుండిరి.

### టంకశాల వీధి (Mint Street)

పూర్వము మద్రాసులో నాణ్యెములను తయారుచేయుచుండిరి; గనుక ఆపని జరుగుచుండిన ఈ వీధిని టంకశాలవీధి అని పిలువసాగిరి. 1692 లో మొగలాయి పాదుషా ఆంగ్లేయులకు పాదుషాబొమ్మతో స్వయముగా నాణెములను అచ్చుపోసుకొనే హక్కునిచ్చెను. నాటినుండియు నిచ్చట చిర కాలము ఆపని జరిగియుండెను. ఆపని ప్రస్తుతము నిలిచిపోయినను ఆ వీధి కాపేరు మాత్రము పోలేదు. ఈ వీధి చాలాపొడవు.

### ఓడకాలు వీధి

పూర్వము మద్రాసులో దేశవాళీ ఓడవర్తకము జరుగుచుండెను. ఈ ఓడవర్తకమున పూర్వము సుప్రసిద్ధులు సూరంవారు, అవధానంవారు, గుర్రం వారు మొదలైన నెల్లూరిజిల్లా బ్రాహ్మణులు, తుమ్మగుంట ద్రావిడులు. వీరు ముత్యాలవర్తకమున, పగడాల వర్తకమున చాలా పేరుపొందినవారు. ఈ ఓడవర్తకమున ముఖ్యముగా క్రొత్తపట్నం, ఓడరేవు, బందరు, శ్రీకాకుళం,

కాకినాడ మొదలగు రేవులనుండి మద్రాసుకు సరుకు దిగుమతి అగుచుండెను; మద్రాసునుండికూడ సరుకు ఆయారేవులకు ఎగుమతి జరుగుచుండెను. ఆ కాలమున మద్రాసు సముద్రతీరమునకు సమీపమున నొక వీధిలో ఓడ స్తంభములు (ఓడకాళ్లు) వగైరా ఓడసామానులు తెచ్చి ఉంచుచుండిరి. అప్పుడా వీధికి ఓడాకాలువీధి అని పేరువచ్చినది. ఈ ఓడవ్యాపారము క్రమముగా నిలిచిపోయినది. అంత నా వీధిలో హీనజాతి వ్యభిచారస్త్రీలు కాపురముండ సాగిరి. క్రమముగ నా వర్తకమునకా వీధి పేరువడసినది. సమీపమున నున్న కోటలోనుండి తెల్లసైనికులు ఆ వీధిలోకి షికారు వెళ్లుచుండిరట. ఈ వ్యభిచారస్త్రీలు సిగ్గువిడిచి గుమ్మములో నిల్చుండి దారినబోవు వీరిని పిలువ సాగిరట. అంతట వారు (Why do you call me ?) 'నన్నేల పిలిచెదవు ?' అని అడుగ సాగిరట. ఆవిధముగానది Why do you call (me) street అన్నది అపభ్రంశమై "ఓడిక్కాల్ వీధి" అని మారి, ఆ పేరు స్థిరపడినది అని పెద్దలు కొందరు చెప్పుదురు. మొత్తమునకు ఆ వీధికాపేరు వచ్చుటకు మూలముమాత్రం ఓడసామానులు వీధులలో పడియుండుటే అనవలయును. కాలక్రమమున నావీధి వ్యభిచారస్త్రీలకు నిలయమగుటచే పెద్దమనుష్యులా వీధికిపోవుటకు జంకుచుండిరి.

## ఏడుబావుల వీధి (Seven Wells Street)

పూర్వము మద్రాసులో కొళాయినీరు లేనప్పుడు నగరమునకు నీటి సప్లైకి మూలమైన ఏడుబావులను వేరుగ ప్రస్తావించియున్నాను. ఆ ఏడు బావులున్న వీధియగుటచేత నీవీధికి ఏడుబావులవీధియన్న పేరు వచ్చినది.

## ఐస్‌హౌస్ రోడ్డు (Ice House Road)

ఈ పేరుగల వీధిమొదట వితంతు శరణాలయం (Windows Home) అను గుండ్రటి కట్టడము ఐస్‌హౌస్ అను పేరుతో నున్నది. దీని ప్రక్కననే వెలింగ్డన్ బాలికాపాఠశాల (Wellingdon Girls' Training School) గలదు. పూర్వము మద్రాసులో మంచుగడ్డలను యుత్పత్తిచేయుట లేదు. అప్పుడు దొరలు ఉపయోగార్థము విదేశములనుండి మంచుగడ్డలను ఓడలలో తెప్పించి ఈ కట్టడములో నిలువయుంచేవారు. అప్పుడందుచే ఈ కట్టడమునకు ఐస్‌హౌస్ (Ice House) అని పేరు గలిగినది. మంచుగడ్డను నిలువ చేయుటకు ఈ కట్టడములో గచ్చుతో గుంటను కటియుండిరి. ఇచ్చటనే మంచుగడ్డ తయారుచేయుటకవకాశ మేర్పడగానే దాని అవసరము తప్పిపోయి నది. అంతనది అమ్మకమునకురాగా మొట్టమొదట బిళిగిరి అయ్యంగారుఅను

అడ్వొకేటు కొనెను. ఆ తరువాత గవర్నమెంటువారు దానిని కొని బాగు చేయించి అందు వితంతుశరణాలయము నుంచిరి. ఎన్నిచేతులు మారినను ఆ బిల్డింగునకు ఆ పేరు మారలేదు, ఆ రోడ్డునకు నా పేరే ఏర్పడినది.

## వైకుంఠవాత్యాయర్ వీధి

ఈ వీది జార్జిటౌనులో యున్నది. ఇందు ముందు నివసించుచుండిన వారందరు వైష్ణవులు. వీరలలో ముఖ్యముగ వంటచేయువారు, అయ్యంగార్లు నుండిరి. పెండ్లి పేరంటములను చేయించు వైష్ణవపురోహితులు నుండిరి. ఈ వూరిలో కర్మాంతరములలో బ్రాహ్మణులకు శయ్యాదానమునుచేయు ఆచారము కలదు. ఈ శయ్యాదానమునకై సాధారణముగ చనిపోయినవాడు పండుకొనుచుండిన మంచమునే ఇచ్చుట వాడుక. ఈ శయ్యాదానము పట్టు పురోహితుడును వాని భార్యయు శయ్యపై అనగా నా మంచముపై కూర్చుండి పాదపూజను చేయించుకొని దానమును తీసుకోవలయును. ఏ ఊరినుండో పొట్ట ఆత్రమునకై వచ్చిన పేదపురోహితుడు భార్యనుకూడా చంకబెట్టుకొనివచ్చి నాడా? భార్యహాజరులో లేనివాడేమి చేయును? అట్టివారికి దానసమయమున సహధర్మచారిణి యగుటకు బాడుగతీసుకొనివచ్చు భార్యలు ఈవీధిలో సులభ ముగా దొరుకుచుండిరి. ఆమె యే జాతియో తెలియకున్నను, అవసరము కొలది స్మార్త వేషమునుగాని వైష్ణవ వేషముగాని ధరించి ఎబ్బెరికములేకుండా పురోహితుని ప్రక్కన కూర్చుండి, ఏనాటి సుకృతము వల్లనో, కృతువులుచేయు యజమానిచే పాదపూజ చేయించుకొని, శయ్యాదానమును ఆ తత్కాల భర్తతో పాటు స్వీకరించెడిది. ఈ ఊరిలో మరియొక చిత్రము గలదు. మరణించిన వారికి బంధుజలగము లేనప్పుడు కూలిదీసికొని ఏడ్చిపోవువారున్నూ ఉండిరి.

## పాతచాకల పేట

పాతచెన్నపట్నమున పాతచాకలపేట చాల ముఖ్యమైనస్థలము. ఇది తిరు వత్తియూరు హైరోడ్డును అనుకొనియున్నది. ప్రథమములో ఇక్కడ ఈస్టిండియా కంపెనీవారు ఈచుట్టుప్రక్కల వస్త్రములను నేయించి, చలవచేయించి, రంగులద్దించి విదేశములకు ఎగుమతి చేయువారుగదా. ఆయావృత్తుల వారంతయు ఇక్కడ తరతరములుగా కాపురముంటున్నారు. అందు ముఖ్యముగా తానులు చలవచేయువారు విస్తారమగుటచే దీనికి చాకలిపేట అని పేరువచ్చెను. అయితే ఆ వర్తకమునననుసరించి ఇతరజాతులవారున్నూ ఇచ్చటచేరిరి. క్రమముగా నిది పట్నమందలి సంపన్న గృహస్థుల నిలయమై పోయినది. నాడుదీనిని అందచందములుగల ప్రదేశము (Fashionable

# కొత్త శక్తికి
# క్రొంగొత్త మార్గాలు




- హరిత విప్లవం అన్ని ప్రాంతాలకు విస్తరించటం వల్ల ఆహార ఉత్పత్తి మూడు రెట్లకు పైగా పెరిగింది
- సర్వత్రా గ్రామీణ అభివృద్ధి
- జవహర్ ఉపాధి పథకం పేదరిక స్థాయి క్రింద ఉన్న ప్రతీ గ్రామీణ కుటుంబంలో కనీసం ఒకరికి ఉపాధి
- ప్రోత్సాహకరమైన పరిశ్రమ తొమ్మిది శాతం వార్షిక పెరుగుదల, ఎక్కువ ఎగుమతులు.
- అందరికీ మెరుగైన ఆరోగ్య సదుపాయాలు—తల్లీ పిల్లల ఆరోగ్యానికి ఎక్కువ శ్రద్ధ.
- వాస్తవ పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని రూపొందించిన జాతీయ పథకం ప్రకారం స్త్రీలకు
- కొత్త అవకాశాలు
- గ్రామ ప్రాంతాల విద్యార్థులకు మెరుగైన విద్యావకాశాలు
- టెక్నాలజీ మిషన్ల ప్రారంభం-పేదప్రజల జాగృతికి విజ్ఞానశాస్త్ర సహకారం.
- పంజాబ్‌లో మళ్లీ మామూలు పరిస్థితులు నెలకొల్పేందుకు అనేక చర్యలు
- అట్టడుగు స్థాయినుంచి ప్రజాస్వామ్య పునరుద్ధరణ—పంచాయితీ రాజ్‌ను పటిష్ఠం చేయడం.

స్వేచ్ఛ-సుస్థిరత్వం-పురోగమనం

Quarters) అనేవారు. ఇచ్చటనే శ్రీ పిట్టి త్యాగరాయ శెట్టిగారు నివసించు చుండిరి. వారు నేతవృత్తిగల దేవాంగకులములో పెద్దలు; పిదప బ్రాహ్మణేతరోద్యమమునకు నాయకులు. మద్రాసు కార్పొరేషన్‌కు మొట్టమొదటి సారిగా అధ్యక్షులుగా ఎన్నుకోబడినవారు. వారిని "మద్రాసునకు మకుటము లేని రాజు" (The Uncrowned King of Madras) అనేవారు. గవర్నరులను కూడా లక్ష్యపెట్టేవారుకారు. కొల్లా వెంకటకన్నయ్య శెట్టిగారు కూడా ఇక్కడనే నివసించేవారు. వీరినిగూర్చి ఇదివరలోనే చెప్పియున్నాను. వీరు వైశ్యకులమునకు పెద్ద శెట్లు. వావిళ్ల రామస్వామిశాస్త్రులు గారున్నూ సుమారు 100 సం॥ల క్రితము ఇచ్చటనే తమ ఆదిసరస్వతీ ముద్రాక్షర శాలను, గ్రంథనిలయమును నెలకొల్పి నడిపిరి; దానిని వారికుమారులు శ్రీ వెంకటేశ్వర్లుగారు విడువక వృద్ధిచేసి నడుపుచున్నారు. లాయరు కృష్ణస్వామి శెట్టిగారున్నూ ఇచ్చట కాపురముండినవారే. ముట్నూరి ఆదినారాయణయ్యగారును ఈ ప్రాంతమున నుండినవారే. వారు రివిన్యూ శాఖలో గొప్ప గొప్ప ఉద్యోగములను నిర్వహించిరి. చల్లపల్లి జమీందారుల బంధువులును ఈ ప్రాంతములోనే గొప్ప బంగళాలలో నివసించుచున్నారు. పురాతనకాలమున తంజావూరు రామానాయుడుగారును వారికుమారులు రంగయ్యనాయుడుగారును ఇచ్చటనే యుండిరి. కొల్లావారున్నూ రామానాయుడుగారున్ను ఇచ్చట తమ తమపేరట అగ్రహారములు నెలకొల్పిరి. కొల్లావారి అగ్రహారమునందే ముట్నూరి ఆదినారాయణయ్యగారు నివసించుచుండినది. ఇచ్చటనే ఆంధ్రవైష్ణవ పండితోత్తములుండిరి. ఆ రోజులలో ఇచ్చట విద్వద్గోష్ఠులు హెచ్చుగ జరుగుచుండెడివి. ఇంతవరకు ఆంధ్రులనే చెప్పితిని. నాడు ఆంధ్రులే ప్రబలులై యుండుటచే వారితోపాటు ఆంధ్రేతరులలో గొప్పవారును ఇచ్చట నివసించుచుండిరి. సర్ ఉస్మాన్‌గారు గొప్ప యూనానీ వైద్యకుటుంబమునకు చెందినవారు. వారికుటుంబమును ఇచ్చటనే నివసించుచుండెను. సర్ సి. పి. రామస్వామిఅయ్యర్ తండ్రి పట్టాభిరామయ్యర్ గారును, సుప్రసిద్ధులు సి.వి. రంగనాథ్‌శాస్త్రి వారి కుమారులు కుమారస్వామిశాస్త్రిగార్లును ఇచ్చటనే నివసించుచుండిరి. దాక్షిణాత్యవైష్ణవులు మద్రాసునకు పెద్ద ఉద్యోగస్థులుగాను, వకీళ్లుగాను వచ్చి మైలాపూరున నివాసమేర్పరచుకొనిన పిదప, ట్రాము, బస్సు సౌకర్యము లిటు హెచ్చిన పిదప చెన్ననగర సౌభాగ్యలక్ష్మి ఉత్తరము నుండి దక్షిణమునకు మ్రొగ్గినది.

## మద్రాసులో కట్టడములు

నేడు మద్రాసులో గొప్ప కట్టడములై రాణించుచున్నవి చాలావరకు నేను ఈ ఊరికి వచ్చిన తర్వాతనే చూచుచుండగా కట్టబడినవే. కావున ఆయా వాని కట్టడపు చరిత్రలు కొన్ని నాకు తెలియును.

## హైకోర్టు భవనము

నేను కొన్ని దినములు పచ్చయప్ప కాలేజీకి సంబంధించిన గోవిందప్ప నాయకరు హైస్కూలునందు చదువుచుంటిని. నేను అక్కడ చదువుచుండిన కాలముననే ఇప్పటి క్రొత్త హైకోర్టు భవనమును కట్టుచుండిరి. ఈ కట్టడమును తాటికొండ నంబెరుమాళ్ల శెట్టిగారు కంట్రాక్టుకు తీసుకొని కట్టుచుండిరి. ఆ కట్టడమునకు విశేషముగ మలిచిన నల్లరాళ్లను ఉపయోగించుచుండిరి. ఆ రాళ్లను సులభముగ పైకి తీసుకొని పోవుటకు కొన్ని యంత్రములను (Lifts) వాడుచుండిరి. ఆ యంత్రములను చూచుటకు స్కూలు నుండి కొందరు పిల్లకాయలు అక్కడికి పోవుచుండిరి. నేనును బడికి పోవుటకు ఇష్టములేనినాడు, పాఠములను చదువనినాడు, కానీ బటానీలనుకొని జేబులోపోసుకొని కట్టుచుండు కట్టడము వద్దకుపోయి కాలమును గడుపుచుంటిని. గనుక ఈ కొత్త హైకోర్టు నా తనిఖీ మీదనే (Supervision) కట్టబడినదని చెప్పవచ్చును. పాత హైకోర్టు యిప్పటి కలెక్టరు ఆఫీసు నందుండెను.

## వై. యం. సి. ఏ. భవనము

ఇప్పుడు Esplanade లో యున్న కొత్త Y. M. C. A. భవనము కూడా నా కళ్ల యెదుట కట్టబడినదే. ఈ భవనమును కట్టకముందు ఈ సంస్థ హైకోర్టు యెదుట ఒక చిన్న మేడలో ఉండినది. అక్కడ బుక్కీపింగ్, టైప్ రైటింగ్, షార్ట్‌హాండు (Book-keeping, Typewriting, Shorthand) మొదలగు విద్యలను నేర్పించుచుండిరి. నేను కూడ ఆ క్లాసులో చేరి షార్ట్‌హాండును టైప్‌రైటింగులను (Shorthand & Typewriting) విద్యలను నేర్చుకొనుచు ఆ సంస్థలో సభ్యుడనైతిని. పిమ్మట క్రొత్తగ కట్టిన భవనమునకు సంస్థ చేరగనే నేను కూడ అక్కడచేరి శాండో యక్సరసైజు (Sandow Exercises) మొదలగు (Indoor Games) వ్యాయామములను నేర్చుకొనుచుంటిని. ఈ Y. M. C. A. తో అప్పటినుండి యిప్పటివరకు నాకు సంబంధము గలదు. ఇప్పుడు నేను నివసించు కేసరి కుటీరము భవనమునకు ప్రక్కననేయున్న రాయపేట బ్రాంచి Y. M. C. A. లో నేను సభ్యుడుగనున్నాను. అక్కడ జరుగు ఆటపాటలలో నేను పాల్గొనుచుందును. ఇంటి ప్రక్కననే యున్నందున ఆ విశాలమైన మైదానములో అచారపచార చేయుచుందును.

(ఇంకా వుంది




## జులై 20, 1989

సరిగ్గా ఇరవై సంవత్సరాలు క్రితం ఈ రోజున (1969 జులై 20) నీల్ ఆమ్ స్ట్రాంగ్ (Neil Arm Strong) చంద్ర మండలంపై పాదం మోపి, మానవ వైజ్ఞానిక పురోభివృద్ధిలో ఒక వినూత్న ప్రకరణకు ఆద్యుడయాడు : 'నా అడుగు చిన్నది - కాని, మానవాళికిది మహోన్నత విజయం' - అన్నాడు నీల్ ఆమ్ స్ట్రాంగ్. అంతరిక్ష యాత్రలు అనేక రంగాలలో మన వైజ్ఞానిక పరిధిని పెంచుతున్నాయి. సమాచార వ్యాప్తిలో, వైద్య రంగంలో, వాతావరణ సూచనలలో, భూగర్భ నిక్షేప పరిశోధనలో - ఒకటేమిటి, అనేకానేక విధాలుగా, అంతరిక్ష విజ్ఞానం దైనందిన జీవితంపై ప్రభావం చూపెడుతోంది. చంద్ర మండల విజయం చిహ్నమైన 20వ జయంతి సందర్భంగా అమెరికన్ సెంటర్లో ఈ మధ్యాహ్నం రెండున్నర నుంచి ఆరు గంటలదాకా వరల్డ్ నెట్ డైలాగ్, అపొల్లో 11 సిబ్బందితో ఇంటర్వ్యూ, జుపిటర్ ఒడెస్సీ వంటి చిత్రాలు ఆహ్వానితులకు చూపించారు. ....వరల్డ్ నెట్ డైలాగ్‌లో (World net Dialogue : 20th Anniversary of Moon - Landing) చంద్ర మండల విజయం సాధించిన నౌకకి కమాండరైన ఆల్డ్రిన్ (నీల్ ఆమ్ స్ట్రాంగ్ నౌకకి తనని కట్టివేసే సూత్ర బంధంతో బయట పాదం పెట్టాడు; నౌకలో వుండి, అతనినీ నౌకనీ కాపాడే బాధ్యత ఆల్డ్రిన్‌ది) న్యూఢిల్లీ, జాకార్తా, రియోడిజనిరో, మాడ్రిడ్ మొదలగు నగరాలనుంచి వేసిన ప్రశ్నలకు 'వరల్డ్ నెట్' ద్వారా అప్పటికప్పుడు సమాధానం చెబుతాడు. చంద్ర శిలలో ఏముందని ఒకరు అడుగుతారు. 43 శాతం ప్రాణవాయువు, హీలియమ్ ఉన్నాయి; చంద్ర శిల మానవాభ్యుదయానికి ఎంతగానో ఉపయోగపడే మాట నిజం; అది తొందరలోనే చూస్తాం' - అంటాడు : 'నీల్ ఆమ్ స్ట్రాంగ్ చరిత్ర పుటలలోకి ఎక్కాడు; నౌకకి కమాండరై వుండికూడా మీకా అదృష్టం ఎందువల్ల కలగలేదు?' అనే ప్రశ్నకు 'ఇరువురిలో ఎవరో ఒకరమే కదా మొట్టమొదటిగా చంద్ర మండలంపై పాదం పెట్ట గలిగేది. ఆ రెండు గంటల ఇరవై నిముషాలూ నౌకని కాపాడుతూ, అతనిని

సురక్షితంగా భూమ్మీదకి తీసుకు రావడం నాబాధ్యతకదా ! ఈ బాధ్యత ముఖ్యమా, పత్రికలలో మనపేరు పెద్ద క్షరాలలో రావడం ముఖ్యమా ? - మీరే ఆలోచించండి. వైజ్ఞానిక ప్రపంచంలో యిటువంటి అల్ప విషయాలు మమ్మల్ని స్పృశించవు ; ఆ నిర్ణయాలు తీసుకొనే నిపుణులు వేరే వుంటారు' - అన్నాడు ఆల్డ్రిన్. అపోల్లో, పయొనిర్, వాయేజర్, ఛాలెంజర్ ఈ కార్యక్రమాలూ ప్రయత్నాలూ చూస్తున్నప్పుడు మానవ భవిష్యత్తుపై ఎంతో ఆశాభావం కలుగుతుంది. ఒక వంక దారిద్ర్యం అజ్ఞానం విలయ తాండవం చేస్తున్నప్పటికీ జుపిటర్ ఒడెస్సీ (Jupiter Odyssey) వంటివి చూస్తున్నప్పుడూ, కార్ల్ సాగాన్ వంటి వైజ్ఞానిక వేత్త పలుకులు వింటున్నప్పుడూ 'మానవుడు అజేయుడు - చిరంజీవి' అని నమ్మకం దృఢ మవుతుంది. ప్రపంచ వ్యాప్తంగా యుద్ధోన్మాదం తగ్గి, మారణాయుధాల కోసం తగలేసే బదులు వైజ్ఞానికి పరిశోధనలకు వెచ్చిస్తే, ప్రపంచ ప్రజలు సుఖపడతారు - అంటాడు ఆల్డ్రిన్.... మన సౌరమండలంలో సూర్యుని తర్వాత సూర్యుడంతటివాడు 41 కోట్ల మైళ్ల దూరానున్న జుపిటర్ (బృహస్పతి). వాయేజర్ నౌకలు, పయొనీర్ - 1 కొన్ని విశేషాలు తెలిపాయి. 'పయొనీర్ - 2' ద్వారా ఎన్నో కొత్త విషయాలు ఈ తొంభయిలలో తెలియనున్నాయి.

. . . . . 21

సంగీత నాటకోత్సవాల ద్వారా జాతీయ సమైక్యతకు కృషి చేసే సత్ప్రయత్నంలో కార్పొరేట్ సెక్టారులో ప్రథమశ్రేణి నున్న వియస్‌టి ఇండస్ట్రీస్ వారు, 1981 నుంచీ అనేక విధాల ఈ సమగ్రతా సమైక్యతా కృషిలో నిమగ్నమై వున్న మద్రాసు తెలుగు అకాడమీవారు (అధ్యక్షులు : పి ఓబుల్ రెడ్డి - కన్వీనరు : టివికె శాస్త్రి) సంయుక్తంగా మ్యూజిక్ అకాడమీలో 'ది స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్స్' ని (The Spirit of Freedom Concerts) పద్మభూషణ్ ఉస్తాద్ బిస్మిల్లా ఖాన్ ఉత్సవజ్యోతి వెలిగించగా, ప్రారంభించారు. సంగీతా కాసెట్స్ వారి 110 వ బాలమురళీ కృష్ణ కాసెట్, ఇవ్వాళ ఈ వేదిక మీద రిలీజ్ చేశారు. వియస్‌టి వారి తిరుమలై, అకాడమీ అధ్యక్షులు ఓబుల్‌రెడ్డి, మ్యూజిక్ అకాడమీ వాసు, బాలమురళీ కృష్ణ, ప్లేబాక్ జానకి, ముఖ్య అతిధి బిస్మిలా ఖాన్ వేదికపై ఆశీనులై వుండగా, కన్వీనరు టివికె శాస్త్రి, మద్రాసు తెలుగు అకాడమీ ఆశయాలూ లక్ష్యాలూ వివరించారు ; ఓబుల్ రెడ్డి స్వాగతం తెలిపారు. ఆ తర్వాత సన్మానితులకు పూల దండ వేయడం, పొన్నాడై కప్పడం, మెడాలిన్ ఇవ్వడం యివన్నీ యధావిధిగా జరిగే అంశాలు. పద్మభూషణ్ ఉస్తాద్ బిస్మిల్లా ఖాన్‌కి కిరీటం పెట్టించి, ఆయన బృందంలోని సభ్యులందరినీ

సన్మానించారు. తంబన్‌గా ఆరుగంట లకి ప్రారంభమైన ఈ కార్యక్రమ మంతా ఆరూ నలభైకి, ఊకదంపు ఉపన్యాసాలు లేకుండా, మీరు గొప్ప అంటే మీరు గొప్ప అని ఒకరి నొకరు పొగుడుకోవటం లేకుండా, నిముషాల వారీ నిర్వహించ గల దీక్షత, నేర్పూ శాస్త్రిగారి సొమ్ము - ఆయనకు సాటి మరొకరు లేరు ....
షెహనాయ్ కింగ్‌గా ప్రపంచ ఖ్యాతి పొందిన బిస్మిల్లా ఖాన్ 1937 నాటి ఆలిండియా మ్యూజిక్ కాన్ఫరెన్స్‌లో (కలకత్తా) స్వర్ణపతకం పొందారు. ఆ తర్వాత దేశ దేశాలలో విజయ పరంపర, అఖండగౌరవమూను! ఆ ముఖం లోని చిరునవ్వు రతనాల వెలుగు అని పిస్తుంది. బిస్మిల్లా ఖాన్ షెహనాయ్ వినడమంటే గాంధర్వలోక విహారం. ఆ గాన స్రవంతి మనసున మలయ పవనమై. హృదయాన్ని రసోల్లాసంతో వూగిస్తుంది.

. . . . . 22

ఇవ్వాళ మ్యూజిక్ అకాడామీలో అలమేర్వల్లి భరతనాట్యమూ, మాధవీ ముద్గల్ ఒడిస్సీ: ఇరువురూ తమ విద్యలో నిష్ణాతులు - ఇరువురూ విడి విడిగాను, సంయుక్తగాను నాట్య రీతులు ప్రదర్శించి, ప్రేక్షకులని ఆనంద రస వాహినిలో ముంచెత్తారు. అలాగే గాయత్రి వీణ, ఉస్తాద్ అహమ్మద్ హుస్సేన్‌ఖాన్ సితారా, బాలమురళి వయొలా - త్రివేణీ సంగమంకాగా, అందులో బాలమురళి జాహ్నవీ తోయాన్ని గుర్తుచేశారు.... ఇవ్వాళ పూర్తిగా కుర్చీకి అంటుకుపోయి వినడంగాక, మధ్యలో మణిగారి అమ్మాయి లక్ష్మి, కృష్ణ గాన సభలో ఇస్తున్న కూచిపూడి ప్రదర్శనకు వెళ్లవలసివచ్చింది. లక్ష్మిలో గల నాట్య కళాభిరుచి, ఆ విద్యపట్ల ఆమెకుగల శ్రద్ధ, చాలాకాలంగా తెలుసు, నాలు

_దు ప్రదర్శనలు చూశాను కూడా! అయితే, ఈనాడు ఆమె చూపిన ప్రతిభ, నాట్యకళకు అంకితమై తాదాత్మ్యం పొందగల లక్షణం ప్రశంసనీయంగా ఉన్నాయి. అలౌకికమైన ఆత్మ నివేద నను కృష్ణభక్తిలో ఆమె అద్వితీయంగా చూపగలిగింది. నిర్దిష్టమగు అంగికమూ, ప్రసన్నమగు లాస్యముతో, చక్కటి ముద్రలూతో భావ ప్రకటనను రస స్ఫోరకంగా చూబుతూ, అహూతుల మనఃపూర్వక అభినందనలు పొంద గలిగింది లక్ష్మి. జీవన పరిపూర్ణతకు రాచబాటవంటిది కళాసరస్వతికి ప్రణ మిల్లుతూ చేసే సేవాభాగ్యం (ఈ నెల ముఖచిత్రం)

. . . . . 23

ఉదయం తాజ్ కోరమాండల్‌లో యమ్‌జె ఫార్మస్యూటికల్స్ వారి కాప్స్ అండ్ హోయర్ (MJ Pharmaceuticals, Baroda) సింపోజియమ్. యమ్‌జె వైద్యసలహాదారు డాక్టర్ వంకాని, స్వాగత వచనం చెప్పిన మీదట, డాక్టర్స్ వి. శేషయ్య, సిబి పంజీవి, యస్. వెంకటరామన్, ఎ రామచంద్రన్ పొద్దుటి సమావేశంలో పాల్గొంటారు. పదకొండున్నరకి టీ బ్రేక్ అయాక, డాక్టర్స్ బి మాధవన్, ఎ సుందరం, ఆర్‌యస్ హరిహరన్ డయాబిటీసుని ఇన్సులిన్ ద్వారా కంట్రోలు చేయడంలోని సాధక బాధ కాలు వివరిస్తారు. ఆ తర్వాత మరి కొందరు డాక్టర్లు ఈ విషయాలు చర్చిస్తారు. ఇది పూర్తిగా వైద్యనిపు ణుల చర్చాగోష్ఠి. పత్రికారచయిత లుగా మాపాత్ర ఏమిటంటే, యమ్‌జె ఫార్మావారు, అమెరికాలోని ఆయల్ఐ 'లిల్లీ' సాంకేతిక సహకారంతో, ఇండి యన్ మార్కెట్‌లో ప్రవేశ పెట్టిన 'ప్యూరిఫైడ్ ఇన్సులిన్' గురించి పాఠకు లకి చెప్పడం.... డయాబిటిస్‌ని నిరో ధించడానికి 'ఇన్సులిన్' 1921 లో కనిపెట్టారు. 1922 లో 'ఎల్ఐ లిల్లీ' కంపెనీ స్థాపన జరిగింది .... 1923 నుంచీ డాక్టర్లు, ఇన్సులిన్‌ని వైద్య రీత్యా ఉపయోగిస్తున్నారు. ఎమ్‌జె ఫార్మావారు గత కొంత కాలంగా 'యల్ఐ లిల్లీ' సాంకేతిక సహకారంతో 'ప్యూరిఫైడ్ ఇన్సులిన్' ని, ఇండియా లో ఉత్పత్తిచేసి, బయట దేశాలకు ఎగుమతి ద్వారా విదేశ మారకాన్ని పొదుపు చేయగలుగుతున్నారు. డయా బిటీస్ (చక్కెరవ్యాధి) భారతదేశం మొత్తం మీద దక్షిణాన నాలుగు రాష్ట్రాలలో అధికంగా ఉంది. అందు కని వైద్య విజ్ఞాన సంబంధంమగు ఈ పరిశీలనా చర్చను మద్రాసులో నిర్వ హిస్తున్నారు. ఎమ్‌జె ఫార్మా వైస్ ప్రెసిడెంట్ ఆర్ యమ్ వి సాగర్, మద్రాసు ప్రతినిధి నటరాజన్, హైదరాబాదు ప్రతినిధి ప్రసాద్, ఈ 'ప్యూరిఫైడ్ ఇన్సులిన్' చక్కెరవ్యాధిని ఎలా విజయవంతంగా ఎదుర్కోగలదో, పత్రికలవారికి సవివరంగాచెప్పారు. సింపోజియమూ, పానెల్ డిస్కషనూ పూర్తిగా వైద్యపరిభాషలో జరిగాయి .... వియస్‌టి ఇండస్ట్రీసూ, మద్రాసు తెలుగు అకాడమీ సంయుక్తంగా మ్యూజిక్ అకాడమీలో నిర్వహిస్తున్న

'స్పిరిట్ అఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్స్' (VST Industries & Madras Telugu Academy... The Spirit of Freedom Concerts) మూడవ రోజున టివి శంకరనారాయణన్ గాత్ర కచ్చేరీ - భక్తవత్సలం మృదంగం, మైసూరు నాగరాజ్ వయొలిన్, హరి శంకర్ కంజీరా. రాల్లరంగించే విమల గాంధర్వం వినిపించారు శంకరనారాయణన్. ఆ సుశ్రావ్యగానం త్యాగరాజుని మదిలో సాక్షాత్కరింపజేసింది ...."దేశసమగ్రత సమైక్యత లక్ష్యంతో ఒక సాంస్కృతిక సంస్థ (మద్రాసు తెలుగు అకాడమీ) యింత చైతన్యవంతమగు కృషిచేయడం ఎంతో ముదావహమైన విషయం. సర్వమానవాళినీ ఏక సూత్రంతో కట్టివేయగల సామర్థ్యం సంగీతానికి ఒక్కదానికే ఉంది. రెండు తడవలు శంకరనారాయణన్ గాత్రం వినగల అవకాశం పోగొట్టుకున్నాను - ఇవ్వాళ టివికె శాస్త్రిగారి కారణంగా అది వానగూడింది" అన్నారు ముఖ్య అతిథిగా విచ్చేసిన కేంద్ర సమాచారశాఖ కార్యదర్శి పి మురారి. వియస్టివారి మేనేజింగ్ డైరక్టర్ భూతలింగం ఈనాటి కార్యక్రమానికి గౌరవ అతిథి; మద్రాసు తెలుగు అకాడమీ ఛెయిర్మాన్ పి ఓబుల్రెడ్డి సభాధ్యక్షులు. .... ఇంటర్వెల్ తర్వాత హైమంతీ శక్లా (కలకత్తా) పాడిన సూరదాస్, మీరాభజనలు భక్తికీ రక్తికీ వంతెన వేశాయి. ఆ సంగీతపుటలలలో ప్రేక్షక హృదయం వూయలలూగింది. అయితే, పోయినసంవత్సరం ఆగస్టులో 'భారత్ కల్చరల్' లో పంక్షన్కి విజయ

వాడలో పాడినప్పుడు, యింతకంటె గొప్పగా సంగీతఝరిలో లీనమవగలిగారేమోననిపించింది - .... మూడు రోజుల పండగ దిగ్విజయంగా ముగిసింది - కార్యక్రమ ప్రయోక్త: జయంతీ సుబ్రహ్మణ్యం. మ్యూజిక్ అకాడమీలో కిందా పైనా ఒక్కసీటు ఖాళీలేదనీ కారిడార్స్‌లో నిలబడ్డారనీ స్వయంగా చూసినవారికిగాని తెలీదు .... ఇది అయిపోయింది. ఇక, ఢిల్లీ ఉత్సవం (నవంబరు 89) వైపుగా శాస్త్రిగారి దృష్టి. అయనకింత ఓపికా, ఉత్సాహం ఎక్కడనుంచి వస్తున్నాయని అడుగుతారు చాలామంది ; ఐశ్వర్యం కాదు, ఆత్మబలం. ఐశ్వర్యం మనిషిని తినేస్తుంది ; ఆత్మబలం మనిషిని, మనసుని విస్తృతపరుస్తుంది. అందుకు ప్రత్యక్ష తార్కాణం టివికె శాస్త్రి. . . . . . 26

'అగ్ని (AGNI) అనేమాట ఎవేకెన్డ్ గ్రూప్ ఫర్ నేషనల్ ఇంటిగ్రేషన్‌కు (Awakened Group for National Integration) క్లుప్తీకరణ, ఈ సంస్థకు మూల విరాట్‌లు శివశంకరి, మాలన్. ఇరువురూ సాహితీ రంగంలో సుప్రసిద్ధులు - జాతీయ సమైక్యతకు యితోధిక కృషి చేయాలనే చిత్తశుద్ధీ, సంకల్పశక్తీగలవారు. సామాజిక స్వరూపాన్ని, వాస్తవికతా వలయానికి కట్టుబడి వీక్షిస్తూ, లోటుపాట్లను సరిదిద్దుకోగల మార్గాలు అన్వేషించమంటుంది 'అగ్ని' - ఇవ్వాళ భారతీయ విద్యాభవన్‌లో ముగ్గురు ప్రముఖులతో ముఖాముఖి ఏర్పాటు చేశారు .... 1 ఈ మహానగరంలోని ప్రజల శాంతిభద్రతలకు బాధ్యతమోసే పోలీసు కమీషనర్ దొరై ; 2 ఒక నెంబరుకి డయల్‌చేస్తే మరొకనెంబరు రావటం పరిపాటి అయిపోయిన మద్రాసు టెలిఫోనుల జనరల్‌మేనేజరు విశ్వనాథన్ ; 3 మిగతా మూడు ప్రధాన నగరాలతో పోల్చిచూస్తే మా ఆదాయం చాలా తక్కువ కాదా అని సంజాయిషీ చెప్పుకు తృప్తిపడే మద్రాసు కార్పొరేషన్ అసిస్టెంట్ కమీషనర్ కోటీశ్వరన్ ఈ నాటి వక్తలు, శ్రోతలు నిలబెట్టి అడిగే ప్రశ్నలకు సముచిత సమాధానం చెప్పవలసినవారూను ! .... సింపుల్ ఇంజరీ, గ్రీవస్ ఇంజరీ, కాగ్నిజబుల్ అఫెన్స్, మెకాలే కాలంనాటి పీనల్ కోడ్ - యిలాటివి సీరియస్‌గా చెబుతూనే, లైటర్ వీన్‌లో సభికులని నవ్వించారు దొరై. పోలీసుశాఖని తప్పుబట్టబోయేముందు. వారు ఎటువంటి పరిమితులకు లోనై తమ బాధ్యత నేరవేరుస్తున్నదీ తెలుసుకోమన్నారు .... గ్రాహమ్ బెల్ టెలిఫోన్ కనిపెట్టిన ఆరు సంవత్సరాలలో మద్రాసు నగరానికి టెలిఫోన్ వచ్చిందనీ, మూడు చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో (జార్జిటవున్) 40 వేల టెలిఫోనులు వున్నాయనీ, మద్రాసు పరిసరాలలో ఒకలక్షా 88 వేల టెలిఫోనులు పనిచేస్తున్నాయనీ ఎలక్ట్రానిక్ ఎక్స్‌ఛేంజి, అండర్‌గ్రవుండ్ కేబుల్ - వీటిద్వారా కన్స్యూమర్ సర్వీస్ మెరుగు పరుస్తున్నామనీ

చెప్పారు విశ్వనాథన్ .... గతుకుల రోడ్లు, వర్షపునీటి పారుదల, కూరల మార్కెట్లు, తక్కువరాబడి ఎక్కువ ఖర్చులు, యిత్యాది విషయాలు ప్రస్తావించారు కోటీశ్వరన్. ముగ్గురూ తమ సాధకబాధకాలు ఒక మైత్రీ గోష్టిలా మనసువిప్పి మాట్లాడారు. ఇంత రసవత్తరమైన కార్యక్రమం ఏర్పాటుచేసిన శివశంకరి, మాలన్‌లు అభినందనీయులు, ఈకార్యక్రమం పేరు బ్రిడ్జెస్ (వంతెనలు).

. . . . 28

"వేదిక మీద మీ మాటలు ఎంతో బావుంటాయి - ఆమె చెప్పే హరికథ యింకెంత బావుంటుందో వినాలని ఎన్నాళ్లగానో ఎదురుచూశాం"- అంది మాలతీ చందూర్, మమ్మల్ని రిసీవ్ చేసుకుంటున్న పార్లమెంటు సభ్యులు రావుగోపాలరావుగారితో! 'కళా రంజని' వారు (అధ్యక్షులు: పివి రమణయ్యరాజా) భారతీయ విద్యాభవన్‌లో రావు కమలకుమారి హరికథా కాలక్షేపాన్ని, 'బ్రవున్‌శాస్త్రి' కుమార్తె వివాహానికి విరాళ సేకరణ నిమిత్తం, ఏర్పాటుచేశారు .... ఆదిభట్ల నారాయణదాసు శిష్యులు ప్రఖ్యాత హరికథా విద్వాంసులు అయిన మండా సూర్యనారాయణ శాస్త్రిగారి కుమార్తె ఈమె. తండ్రిపాదాల వద్ద ఆయన సుశిక్షణలో సాంప్రదాయికంగా నేర్చుకొన్న విద్య - అందుకుతోడు భావయుక్తంగా పలికే మధురగాత్రమూ, కథాకథన నైపుణ్యం, జలజలపారే



# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగు కవరు వుంటేకాని అంగీకారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు. మాఊళ్లో 'జగతి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి - చందాదారులుగా జేరమని! రెండు సంవత్సరాలకి, అంటే 24 సంచికలకు, నలభైఅయిదు రూపాయిలు.

JAGATI Monthly, 2, Kutchery Road, P.B. 2921 - Madras - 600 004.



వాక్ప్రవాహమూ, సంగీత సాహిత్య నృత్యాలతో ప్రేక్షకులని మెప్పించే ప్రజ్ఞాపాటవమూ ఆమె సహజసంప దలు. ఇప్పటికి మూడువందల ప్రదర్శనలు యిచ్చిన కమలకుమారి, అనేకానేక బిరుదులు పొందారు. కపిలేశ్వరపురం హరికథాపాఠశాలని, తండ్రిగారిని, ఈ 'కాంపోజిట్ ఆర్ట్' కి పితామహుడైన ఆదిభట్ల నారాయణ దాసుని సర్మిస్తూ, 'ప్రమీలార్జునీయం' ప్రారంభించారు. తనవంటి మేటి వీరుడులేడని (కురుక్షేత్ర సంగ్రామానంతరము) గోరంత 'అహం' పెంచుకున్న అర్జునునికి, ఆ అహంకారమే అరిష్టాలకు, అవమానాలకు హేతువవుతుంది సుమా - నీకుమించిన శక్తి నిన్ను నడుపుతోంది' అని మెత్తగా సుందరాంగులచేత పాఠం చెప్పించడమే యిందులోని సారాంశం. పరశురాముని వల్ల శాపం పొందిన 'ప్రమీలారాజ్యం' లో, అశ్వమేధ హయంతోబాటు అర్జునుడు బందీ అవుతాడు, "వైరివాడా, నీ అంతటి మహావీరుడులేడని నీ మనోగర్వం. చూడు, ఒక సామాన్యమైనరాణి, తన సేవకులచేత నిన్ను బందిఖానాలో పడవేయించ గలిగింది" - అంటాడు లీలామానుషధారి అయిన శ్రీకృష్ణుడు, అర్జునునిలో పేరుకున్న అజ్ఞానాన్ని తొలగిస్తూ! .... (తొమ్మిది గంటలకు ముగియవలసిన హరికథని, బయట బ్రహ్మాండంగా వర్షం పడుతూండటం వల్ల, మరొక అరగంట పొడిగిం పారనే విషయం, వారంరోజులతర్వాత సత్యనారాయణరావు గారింట్లో తెలిసింది) .... కలర్‌పిక్చర్స్ కాలంలో ఒక హరికథను మూడుగంటల సేపు యింతగొప్పగా రక్తి కట్టించగలిగారూ అంటే, కమలకుమారి ఎంతటి ప్రతిభావంతురాలో మీరే ఊహించుకోవచ్చు.

## 1989 ఆగస్టు 05

పంజాబీ అసోసియేషన్ లజపతిరాయ్ హాలులో, 'ఓటింగ్ వయస్సు 21 నుంచి 18 కి తగ్గించడం' విషయమై 'యూత్‌లైన్ ఫర్ హ్యూమనిజమ్' (Youthline for Humanism) వారి సెమినార్.... "నాకొక వంద మంది యువకులని యివ్వండి - ఈ దేశ స్వరూపమే మార్చి వేస్తాను' అని చెప్పిన వివేకానందుని పలుకులు విస్మరింపరానివి.... 'డెమొక్రసీ ప్రజానుమతితో పాలన' అన్నాడు హాబ్సిస్, ఓటింగ్ హక్కు అనేది, తనూ ఈ సమాజంలో బాధ్యతాయుత పౌరుణ్ణి అనే భావన కలిగిస్తుంది. అమెరికా, బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, ఫ్రాన్స్, సోవియట్ యూనియన్, చైనావంటి దేశాలలో వోటింగు హక్కు పద్దెనిమిదేళ్లు నిండినవారికి సంక్రమిస్తూ వుండగా, మనం 21 ఏళ్లు నిండాలనడం సబబుకాదు. ఎనభైఏళ్ల ముదుసలికి వుండే హక్కు, పదెనిమిదేళ్లు నిండిన ఫస్ట్‌క్లాస్ గ్రాడ్యుయేట్‌కి

ఎందుకుండక పోవాలి? 1975లో అమెరికాను వియత్నామ్ యుద్ధం నుంచి విరమింపజేసినది యువకులు కాదా? 1974-75 నాటి జయ ప్రకాశ్ నారాయణ్ ఉద్యమానికి ఊపిరి పోసినది విద్యార్థులు కాదా? 1905 బెంగాలీ విద్యార్థులు బ్రిటిష్ వారిని ఎదిరించలేదా? 1890 నాటికే బొంబాయిలో 'స్టూడెంట్స్ బ్రదర్ హుడ్' నెలకొల్పబడింది. జాతీయ జీవనంలో విద్యార్థులు తమ సముచిత పాత్ర నిర్వహించడం అన్నివిధాలా శ్రేయస్కరం. అణ్ణాదురై సందేశాన్ని శిరోధార్యంగా భావించినది యువకులే కదా! పద్దెనిమిదేళ్లు నిండిన వారికి ఓటు హక్కు యివ్వడం మన ప్రజా స్వామికాన్ని పటిష్టవంతం చేస్తుంది" - అన్నారు తమిళనాడు సమాచారమంత్రి ముత్తురామలింగం. సెమినార్‌కి తన కీ-నోట్ అడ్రస్‌లో, అధికారంలో ఉన్న కాంగ్రెస్ చేస్తున్న అవకతవకలు ఏకరువు పెడుతూ, యువతపై మోపిన ఈనూతన బాధ్యత మన ప్రజాస్వామ్య వ్యవస్థకు గట్టితన మిస్తుందన్నారు - 'హిందూ' పత్రిక అసోసియేట్ ఎడిటర్ యన్ రామ్. ఉదయం సమావేశానికి అధ్యక్షత వహించిన పార్లమెంటు సభ్యురాలు జయంతీ నటరాజన్, చరణ్‌సింగ్ ఒక్క కలంపోటుతో ఏడు కాంగ్రెస్ పాలిత రాష్ట్రప్రభుత్వాలను రద్దు చేసినప్పుడు, యిది ప్రజాస్వామ్య విరుద్ధం అని దేశంలోని విజ్ఞులు, విబుధవరులు ఆనాడు ఎందువల్ల అన లేకపోయారు - అని ప్రశ్నించారు. కాంగ్రెస్‌పై రామ్ చేసిన ఆరోపణ లన్నిటికీ జయంతీ నటరాజన్ సహేతు కంగా సమాధానం చెప్పి, రాజకీయ మాలిన్యాలలో తలదూర్చక నవో దయ కాంతుల వైపు చూడమన్నారు. యువతపై సంపూర్ణ విశ్వాసం ఉండ టం వల్లనే నాలుగున్నర కోట్లమందికి ఓటుహక్కు కలిగించేందుకై కాంగ్రెస్ పార్టీ పూనుకున్నదనీ, సుదీర్ఘచరిత్ర గల కాంగ్రెస్‌లు లోపాలు వున్నప్ప టికీ సమగ్రత, సమైక్యత లక్ష్యాలతో ప్రజాసంక్షేమ ధ్యేయంతో జాతిని భద్రంగా నడిపిస్తున్నదనీ అన్నారు జయంతీ నటరాజన్.... మధ్యాహ్నం సమావేశానికి పార్లమెంటు సభ్యులు వలంపురి జాన్ అధ్యక్షులు.... యువతీ యువకులు ఎంతో ఉత్సాహంగా చర్చలలో పాల్గొన్నారు.... ఈ సంస్థకు అధ్యక్షులు పిజె అలెగ్జాండర్; కార్య దర్శి: హరిభజన్‌సింగ్.

—యన్నార్ చందూర్



మనం బకెట్లతో సలహాలిస్తాం - కాని, తీసుకొనేది వడ్ల గింజంత!

—అల్లర్

కార్య నిర్వహణలోనే కవితాగానం ఉంది.

—షేక్స్‌పియర్

అతికష్టమైన పని 'నిన్ను నీవు తెలుసుకోవటం'; అతి తేలికైన పని 'ఇతరులకు సలహాలివ్వటం'.

—లెరిటస్



నటన దీక్షాపరుడు - డా॥ చంద్ర
శేఖరం. రచన: కృష్ణానంద్. ప్రచురణ: రంగజ్యోతి బుక్స్, మద్రాసు - 600 018 ....వెల: రు. 40-00.

'మంత్రుల మాటలు వినండి కాని నమ్మవద్దు' అనే డా॥ చంద్రశేఖరం నాటక ప్రచారం ఒక ఉద్యమంగా, నటన ఒక తపస్సు, ప్రదర్శన ఒక యజ్ఞంగా భావించిన అద్వితీయ కళా కోవిదుడు. 'ఏ ప్రభుత్వం ఆమెను గెలువలేదు, ఏ ధనికుడూ ఆమెను కొనలేడు, ఏ పొలిమేరలూ ఆమె ఆత్మను బంధించలేవు' - అని చెబుతా రాయన తన కళాదేవత గురించి!

'సింపుల్ ట్రావెలింగ్ థియేటర్' పేరుతో ఆయన ఆంధ్రప్రదేశ్‌లోని నలుమూలలూ పర్యటించారు; ప్రజల మధ్యకు వెళ్లి ప్రదర్శన లిచ్చారు; వారిని నవ్వించారు; నవ్వు పువ్వులు పంచిపెట్టాడు. చేయగలిగినంత చేయ లేకపోయాననీ, ఇంకా ఏదో చేయాలనీ 85 ఏళ్లనిండిన ఈ నటయోగి తపన ....ఆంధ్ర ప్రభుత్వం 1985 లో ఆయనకు నెలకు అయిదు వందల చొప్పున పెన్షన్ యిద్దామనుకున్న ప్పుడు, 'నాకు మీరు పెన్షన్ యిద్దా మనుకుంటే, నెలకు కనీసం రెండు వేలైనా ఇవ్వాలి. అంతకి తక్కువ పుచ్చుకోవడం నాకూ, మీకూ కూడా గౌరవప్రదంకాదు' అని వ్రాయగలిగిన ధీశాలి యావద్భారతంలో డా॥ చంద్ర శేఖరం ఒక్కరేనేమో!

1953 లో భారతీయ కళాకారుల బృందంతో చైనాలో పర్యటించిన చంద్రశేఖరం, 'ఇంతకు నేను చేసినది: ఒక యింగ్లీషు పద్యాన్ని పంద్రెండు మంది బాలురు, యిద్దరు బాలికలు వివిధ రీతులలో ఒప్పగించటం. దీనిలో ఏమి గొప్పతనం వుందో, కడుపులుబ్బే టట్లు ఆదేశపు ప్రజలు ఎందుకు నవ్వి నారో, నాకే ఆశ్చర్యం వేసింది' - అంటారు. ఒక్కసారి చంద్రశేఖరాన్ని స్టేజిమీద చూసినవారికి తెలుస్తుంది ఆ ప్రజలు ఎందుకు నవ్వారో!.... ఆ తర్వాత 1957లో 'మొనొయాక్టర్' గా సోవియట్ రష్యాలో పర్యటించి, వారి ప్రశంస పొందారు చంద్రశేఖరం.

పదకొండోఏట ఒక ఇంగ్లీషు పత్రికలో నాలుగు వేషాలు వేసిన ఒక వ్యక్తి బొమ్మలు చూసి తనుకూడ అటువంటి మేకప్‌తో ప్రేక్షకులని మెప్పించాలని మొనొయాక్టింగ్ ప్రారం భించిన చంద్రశేఖరం, 'మద్రాసు మోతి

యర్ గా అఖండఖ్యాతి నార్జించారు. పేరు ప్రఖ్యాతులు ఏ కళాకారునీ తృప్తి పరచవు - కళామతల్లి నిత్య నీరాజనం కోరుతూ వుంటుంది.

కృష్ణానంద్ రచనావిధానంబావుంది గాని జీవితకథ అనేది యింకొంచెం క్రమానుగత పద్ధతిలో పాఠకుని ఆకట్టుకోవాలి.

—క్షీరసాగరమ్

✠ ✠ ✠

శబ్దార్థ ప్రపంచం. రచన : ఆర్. సి. ఆర్. ఆలపాటి, వెల : అమూల్యము. ప్రతులకు : ఎ. వి. అంబికా ప్రసాద్, అంబికాదర్బార్‌బత్తి స్ట్రీట్, పవర్‌పేట, ఏలూరు - 534002.

ఈ పుస్తకంలో ముందుగా బీజాక్షరములు - అ ఆ - లతో, ప్రార్థన, తదుపరి అంబికారాగమాల, మరియు శబ్దార్థ ప్రపంచము అన్న భాగములు కలవు. 'అంబికా రాగమాల' - చక్కని భక్తి భావములు గల్గిన 22 కృతులు - అర్థములతోసహా. వాటికి సంగీతము కూర్చి భక్తులందరు నిత్యము పాడుకోవచ్చు. రెండవ భాగము శబ్దార్థ ప్రపంచంలో 108 శబ్దార్థములు కలవు. ప్రతి మనిషి అలవరచుకొనవల్సిన సుగుణములు, వాటిరూపములు; పొందవల్సిన ఆత్మజ్ఞానం విపులీకరించబడినది. ఉదాహరణకు :

సత్ ప్రవర్తన అనేది దుకాణాలలో అమ్మేది కాదు, కొనేది కాదు. సత్ ప్రవర్తనకై ప్రతి మనిషి స్వధతతో కొన్ని మంచి కట్టుబాట్లు, తన శీల సంపదతో కఠోర నిర్ణయాలు చేస్తే తప్ప సత్‌ప్రవర్తన అలవర్చుకోవటం జరగదు....

పూర్వము పుణ్యకోసంపురాణాలతో చేసేవారు ప్రజలు కాలక్షేపం - నేడు పణ్యం కోసం పథకాలతో ప్రచారం చేస్తున్నారు విక్షేపం.... అల్పసౌఖ్యం కోసం కాక అలీన మోక్షం కోసం ఆరాటపడి పనిచేసే జనం కావాలి అనునిత్యం....

—వాణీమోహన్

✠ ✠ ✠

"మరోమారు కల్పవృక్షం" - రచన : వడలి మందేశ్వరరావు. ప్రచురణ : కవిప్రభా, త్రివేణి ప్రెస్ బిల్డింగ్, మచిలీపట్నం. మూల్యం రు. 10-00.

'పారిశ్రామిక వేదాంతి' కొత్తా సూర్యనారాయణ రావుగారు 1930 లో స్థాపించిన "స్వధర్మ స్వారాజ్య సంఘం" అర్ధిక తోడ్పాటుతో, ఆ 'సంఘం' నిర్వాహకులు బివియస్సెస్ మణిగారి ఔదార్యంతో వెలువడిన ఈ పుస్తకంలో, విశ్వనాధ వారి కల్ప వృక్షానికి సంబంధించిన అయిదు ఉపన్యాసాలు వున్నాయి.

మళ్లీ రామాయణం ఎందుకు, రాసినదీ విశ్వనాధ వారి దృక్పథం చెప్పిన మీదట, యుద్ధకాండంలోని శిల్ప సౌందర్యాన్ని వివరించారు వడలి మందేశ్వరరావు. శూర్పణఖ కారణంగా నిప్పురవ్వ పొగలు సెగలూ కక్కింది. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల లోని శకులను మూట గట్టుకు

'వాతాపి జీర్ణం' అంటూ త్రేన్చిన అగస్త్యుడు, రావణ సంహారంలో రామునికి పెట్టనికోటలా నిలుస్తాడు. లంకలో ఉన్నది నిజసీతా, మాయా సీతా అనే ప్రశ్నకు, మాయాసీతా వాదం వైపు మొగ్గుతారు విశ్వనాథ.

రామునిది 'ముగ్ధ మోహన మంద హాసం'-ఆనందాస్యుడు ఆయన. అధునికులు చెప్పే 'మిలియన్ డాలర్‌స్మయిల్' అది. రాముడేనాడూ పకపక నవ్వలేదు - చిరుహాసాన్ని విడనాడలేదు. ఆయన ఆనందమయుడు - ఆనందమూర్తి. మానుషానందాన్ని శతకోటిగా అధిగమించే బ్రహ్మానందపు ఛాయే ఆయన వర్చస్సు, తేజస్సూను ; శ్రీరాముడు శివధనుర్భంగం గావించినది తన భుజశక్తితో కాదు-విశ్వామిత్రుని ఆశీర్వాద బలంతో!

సీతారాముల ప్రేమ కథ సెలయేళ్లకూ, పర్వతాలకు తెలుసునట. ఇక, సీతాదేవి దుఃఖ కథ సముద్రానికీ ఆకాశానికీ తెలుసునట.

వశిష్టుని బోధలవల్ల శ్రీరామచంద్ర మూర్తి కర్మయోగి కావడమే రామ చరితం. తరతరాలకు నిత్యనూతనంగా కనిపించే రామకథ అజరామరం.

—సుమతి

---

ఒక అవున్యంత పని, ఒకపౌను ప్రబోధం కంటె విలువైనది. —హబ్బార్

నలభైకే నిరాశతో నిస్పృహతో కుంగిపోయే వారికంటె, డెబ్బయి దాటినా భవిష్యత్తులోకి ఉత్సాహంతోను, ఆశాపూరితంగాను చూసేవారు మెరుగు. -హెూమ్స్

# సమీక్షలు

# చిత్రజగతి

## అనఘా వారి 'అగ్ని నక్షత్రం'

రాణా ప్రతాప్ (శోభన్‌బాబు) డార్క్ సూటూ, రెడ్ స్కార్ఫూతో తెల్ల సూట్లు ధరించిన ఇరువురు బాడీగార్డ్స్ వెంటరాగా లిమొజైన్ దిగి, కారిడార్స్ దాటుతున్నప్పుడు, అక్కడి వారు భయభ్రాంతులై చూస్తారు; గుమ్మం దగ్గిర నిలబడ్డ ఈ వ్యక్తిని చూడగానే, జడ్జీగారు తను వ్రాయ దలుచుకున్న తీర్పుని మార్చేసి, బోనులోని ముద్దాయి 'నిర్దోషి' అని చెబుతాడు. ఎవరీ రాణా? పదిహేనేళ్ల క్రితం సత్యసంధతని నమ్ముకున్న పోలీసు వుద్యోగి. ఇప్పుడు? ఒక ప్రయివేట్ గాంగ్‌ని భారీ ఎత్తున పోషిస్తూ, దానధర్మాలు చేస్తూ, పేదలకు పెన్నిధిగా నిలిచి, దుష్టశిక్షణ, శిష్టరక్షణ గావిస్తున్న పెద్ద స్మగ్లర్. ఇతని రైవల్ గాంగ్‌కి, ఒక మూల స్తంభం (సత్యనారాయణ), మూడు కొమ్మలూ వున్నాయి. చివరి కొమ్మ వరికి, పెట్టెలో పెట్టి, 'డిబి' కి - అంటే ఈ ముగ్గురన్నదమ్ములలో పెద్దతనికి, - ప్రజెంట్‌గా పంపుతాడు రాణా: ఈ గాంగ్ వార్‌ఫేర్‌లో రాణాకి అండగా నిలిచిన యువకుడు (కళ్యాణ చక్రవర్తి), కరాటె యువతి (రజని) నానా కష్టాలూ పడ్డాక, స్మశాన వాటికలో రెండు గాంగ్‌లూ యధేచ్ఛగా పేల్చు కోవడమూ, బాంబులు విసురుకోవడమూ అయాక, వెనుక పాడిన యుగళగీతం మళ్లీ అందుకు దంపతులవుతారు. శోభన్‌బాబు, మోహన్‌బాబు, సత్యనారాయణ, వేలు, రజని, శ్రీలక్ష్మి మున్నగు వారున్నారు. దర్శకత్వం: శరత్. నిర్మాత: వల్లభనేని దాసు.

## యమ్మెస్ ఆర్ట్ 'అంకుశం'

ప్రముఖ నిర్మాత యమ్మెస్ రెడ్డి ముఖ్యమంత్రిగా నటించిన ఈ సంచలనాత్మక చిత్రంలో విజయ్ (రాజశేఖర్), ఒక పోలీసు యినస్పెక్టరు. తల్లిదండ్రు లెవరో తెలియక అనాధ శిశువుగా కుప్పతొట్టె పక్కన ఊపిరిపోసుకు, మేస్టారి (యమ్మెస్ రెడ్డి) దయార్ద్రత వల్ల సుశిక్షణలో పెరిగి విద్యాబుద్ధులు నేర్చుకు, స్థిరమైన నడవడికకు, న్యాయసంరక్షణకు 'పుట్టుక' ప్రధానం కాదనే విషయం తన పోలీసాఫీసరు పాత్ర ద్వారా నిరూపిస్తాడు విజయ్.

నాయకునికి తలిదండ్రులెవరో తెలియనట్లే, నాయిక పార్వతి (జీవిత) 'నా' అనేవారు లేనిది. నెత్తిమీద తట్ట పెట్టుకు కాయగూరలూ పళ్లు పువ్వులూ అమ్ముకు జీవించే కష్టజీవి. నిజాయితీయే ఆమెకు శ్రీరామరక్ష. ఒకరోజున పుల్లలు ఏరి తెచ్చుకుంటున్నప్పుడు, పాడుబడ్డ యింటిలోని చావుకేక ఆమెకి వినిపిస్తుంది. ఎన్నిక చెల్లదని తన ప్రత్యర్థి హైకోర్టుకి వెళ్లకుండా హోమ్ మంత్రి, కిరాయిరౌడీలచేత చేయించిన మర్డర్ అది. 'అన్న' (మాఫియా నాయకుడు) అవలీలగా హత్యలు చేయించి, పోలీసు ఉన్నతాధికారుల మద్దతుతో, రాజకీయనాయకుల పాట్రనేజ్‌తో, చివరికి సియమ్‌నే లేపేదామనుకుంటాడు. విజయ్ వేళకొచ్చి అడ్డుపడి, కుట్రదారులని టపటపా కాల్చేసి, తన ప్రాణత్యాగంతో మేస్టారిని (ముఖ్యమంత్రి) కాపాడుతాడు విజయ్, 'అన్న' ముఠాని చిత్తుచేస్తాడు. ఎన్నో 'పాజిటివ్ యాస్పెక్ట్స్' గల ఈ చిత్రం రాణించడం తథ్యం. దర్శకత్వం : కోడి రామకృష్ణ. నిర్మాత : శ్యామ్ ప్రసాద్ రెడ్డి.

## ప్రమోదా ఆర్ట్స్ 'ఆర్తనాదం'

'కళ్లు' పిక్చర్‌తో రూప చిత్రణలోను, నిర్మాణ శిల్పంలోను అఖండ విజయం సాధించిన యమ్వి రఘు ద్వితీయచిత్రమిది. చివరివరకూ ప్రేక్షకులని సస్పెన్స్‌లో వుంచే ఈ 'ఆర్తనాదం'లో, జ్యోతి అనే అమ్మాయి, మోడలింగ్ నుంచి తారాపథం వైపుగా ఆశలు అల్లుకుంటున్న ఒక సుందరాంగి. ఆ మధ్యాహ్నం తనకు ఆశాజనకంగా ఉత్తరం రాసిన సిస్టర్ శ్వేత, రాత్రికి రాత్రి ఎందుకు ఆత్మహత్యచేసుకుంటుందని, డిఫెన్స్ డిపార్ట్‌మెంటు నుంచి, డిటెక్టివ్‌గా (రాజశేఖర్) రంగంలోకి దిగిన అన్నగారి అనుమానం. ఎవరో తన సోదరిని హత్యచేశారనుకొనేందుకు తగినన్ని ఆధారాలు దొరుకుతాయి. బాక్‌గ్రవుండ్ ఏమిటంటే, ఒక సినిమా బృందం షూటింగ్‌కని వెళ్లిన మారుమూల ప్రదేశం, అక్కడి హోటల్ ! 'చంటి'కత్తి, తన సిస్టర్ జూకాలు, నిద్రలో నడిచే స్వభావం గల హీరోయిన్ సీత (సీత), ఆ ప్రొడ్యూసరు తన సోదరి మృతదేహాన్ని కారుడిక్కీలో వేసిన వైనం - యిలాటివి లభ్యమవుతాయి. ఎంత సహేతుకంగా చెప్పినా స్థానికపోలీసాఫీసరు ఆ చిత్ర నిర్మాతను అరెస్ట్‌చేయడు. డిటెక్టివ్‌తోబాటు మనకీ పోలీసాఫీసరు అవినీతిపరుడేమోనను అనుమానం కలుగుతుంది. ఆ తర్వాత, నిర్మాతను ద్రోషిగా భావిస్తాం ; డ్రగ్ యడిక్ట్ నిర్మాత సోదరుని దుష్కృత్యమేమో ననుకుంటాము - వీరెవరూ కాదు - సమీక్షతో చెప్పడం సబబు కాదు గనక మీరేచూసి తెలుసుకోండి. సమర్పణ : కెయస్ రామారావు.

## మయూరీ పిక్చర్స్ 'స్వాతి చినుకులు'

లక్ష్మీదేవి (వాణిశ్రీ) రఘునాథ్ (శరత్‌బాబు) అన్యోన్య దంపతులు ; మెడిసిన్ చదువుతున్న అమ్మాయి

శాంత (రమ్య) గారాల కూచి. ఈ శాంత, ప్రిన్సిపాల్ గురునాథ్ (మారుతీ రావు) గారి అబ్బాయి శేఖర్ (సుధీర్), పరస్పరం ప్రేమించుకుంటారు. వారి దరి పెళ్లికి అభ్యంతరం మొదట్లో లక్ష్మీదేవి వద్దనుంచీ, తర్వాత గురునాథ్ వద్ద నుంచీ అంకురించినప్పటికీ, అవి యిట్టే సద్దుమణిగిపోతాయి - ఒక సుధ (జయసుధ) కారణంగా! పద్దెనిమిదేళ్లుగా కలకత్తాలో చిత్రకారిణిగా అజ్ఞాత జీవితం గడుపుతున్న ఆ సుధ ఎవరు? బ్రయిన్ ట్యూమర్‌తో రేపో నేడో అన్నట్టుగా ఉన్న సుధ, చుట్టం చూపుగా వచ్చినప్పుడు, అక్కగారైన లక్ష్మీదేవిలో ఎందుకా కలవరం? ఎందుకా ఆరాటం? తన తోబుట్టువుని బయట గెస్ట్‌హవుజ్‌లో అంత గోప్యంగా వుంచవలసిన అవసరమేమొచ్చింది? మాతృత్వాన్ని అమృతధారలా కురిపించే ఆ యిల్లాలిలో ఏక గర్భ జనితురాలిపై కించిత్తు కూడా కనికరంలేదా? ఈ చిక్కు ముడి విప్పుతూ, ప్రేమా ప్రణయమూకంటె హారతి కర్పూరంలా పరిమళంతో వెలుగుతూ ఆత్మార్పణతో పునీతమయే త్యాగం ఎంత గొప్పదో నిరూపించే ఈ చిత్రంలో వాణిశ్రీ జయసుధలు తమ అపూర్వ నటనా కౌశలంతోను, శరత్‌బాబు గంభీర ముద్రతోను, గిరిబాబు తన హాస్య చంద్రికలతోను ప్రేక్షకులని మెప్పిస్తారు. సమర్పణ : కాంతారావు. నిర్మాత : ప్రతాప్. దర్శకత్వం : చక్రవర్తి.

## లక్ష్మీ ప్రసన్న వారి 'నా మొగుడు నాకే సొంతం'

పేవ్‌మెంట్ టైలర్ లోకేష్ (మోహన్‌బాబు), అతివలకు అందమైన డ్రెస్సులు కుట్టగల నిపుణుడు. ఆ నైపుణ్యాన్ని ఒక స్వప్న (జయసుధ) మెచ్చుకోవడమే గాకుండా, ఆ పేద వానికి జరుగుతున్న అన్యాయానికి జాలిపడి, మనసు పారేసుకున్నదై, తన సంపదతో అతనిని 'స్వప్నలోక్'కి అధిపతిని చేస్తుంది. ఆమె నోరు తెరిచి అడిగినా ఈ ఆధునిక ప్రవరాఖ్యుడు, 'గుడిలో దేవతని పూజించగలనే తప్ప కాళ్లవద్దకు తేగలనా?' - అని డైలాగ్ చెబుతాడు. పాతికలక్షలు చేసే బిజినెస్ అంతా అతనికి ధారాదత్తం చేసి, ఈమె దూరతీరాలకు వెళ్లిపోగా, గర్భవతి అయిన చెల్లెలు పెళ్లి జరిపించే నిమిత్తం, ఆ గర్భానికి కారకుడైన అబ్బాయి (సుధాకర్) తలిదండ్రులకు తనకా దేవత యిచ్చిన సమస్తం సమర్పించడమే గాకుండా, అత్తగారి షరతులు ప్రకారం ఆ అబ్బాయి చెల్లెలు సుమిత్రని (వాణీవిశ్వనాథ్) తను చేసుకుంటాడు; తమకు కలిగిన కూతురికి ''స్వప్న' అని పేరు పెట్టుకుంటాడు .... అసలు స్వప్న, బాంక్ మేనేజరిగా వీరి ఎదురింట్లో కాపరం పెడుతుంది. చట్టప్రకారం తప్పు' అని హెచ్చరించే లాయరు పాత్రలోవి దాసరి ఈ చిత్రానికి దర్శకులు. నిర్మాత : మోహన్‌బాబు.

## 1776 జులై - ఆ నాలుగు రోజులు

# స్వాతంత్ర్య పత్రం

అమెరికాలోని పదమూడు వలస రాష్ట్రాలు, బ్రిటన్ నుంచి విముక్తి పొందాలనే సంకల్పంతో ఉన్నాయి - స్వాతంత్ర్య పత్రాన్ని ప్రకటించాయి. అదే యుద్ధశంఖా రకంగా భావించి, తిరుగుబాటు దారులని బల ప్రదర్శనతో లొంగదీసుకోవాలనే వ్యర్థ ప్రయత్నంలో ఉంది బ్రిటన్ .... ఇక చదవండి.

## జులై నాలుగు

లక్ష్మీవారం ఉదయము నలభై మంది ప్రతినిధులూ సమావేశ మయ్యారు. స్వాతంత్ర్యానికి వ్యతిరేకంగా వోటు చేసినవారిలో కొందరు తమ మనసు మార్చుకు వచ్చారు. మరి కొందరు సమావేశానికి హాజరు కానేలేదు ఏకీభావము వ్యక్తపరిచిన వారిలో కొందరికి తాము అవలంబిస్తున్న పద్ధతి, శుభకరంగా పరిణమిస్తుందా అనే సంశయం ఉంది. ఈ ప్రభుత్వ భవనానికి వందమైళ్ళ దూరాన యాభైవేల సైన్యం అయిదు వందల సంవత్సరాల వయసుగల ఆంగ్ల పార్లమెంటులోని రాజనీతిజ్ఞుల ఆశీర్వాదబలంతో, ఈ టుమ్రీ పార్లమెంటుని ఏమిటీ ఆటలు అని ప్రశ్నిస్తున్నట్లుగా వుంది. యాడమ్స్ లోగడ చెప్పినట్లు విప్లవ సంబంధమైన రాజకీయ నిర్ణయాలు ముగిశాయి. ఇక ముందున్నది రక్తపాతంతో కూడిన యుద్ధకాండ. ఆ యుద్ధ ఫలితమూ విజయసాధనా జనరల్ వాషింగ్టన్ చేతుల్లో వుంది.

కాంగ్రెస్ ప్రతినిధులలో చాలా మంది వాషింగ్టన్‌తో ప్రసంగించారు. అతనితో పరిచయం గలవారే. కాని అందులో కొందరు తమ కళ్ళముందే ఇతనింత మహానాయకుడై పోవడము ఈర్ష్యాభావంతో గమనిస్తున్నారు. కాని ఈ వుదయము వాషింగ్టన్ వద్దనుంచి వచ్చిన లేఖ హృదయవిదారకంగా వుంది. కనుచూపుమేరలో పరిష్కారం కానరాని అతని సమస్యలు అనంతంగా వున్నాయి.

కార్పెంటర్ హాలులో జాన్ యాడమ్స్ తమ విప్లవ సేనాధిపతికి వుండవలసిన అర్హతలు వివరిస్తూ చివరికి వాషింగ్టన్ పేరు వుదహరించే సరికి ఒకరిద్దరు ఆశ్చర్యపోయారు. కాని ప్రతినిధులు జాన్‌యాడమ్స్ నిర్ణయముపై తమకు సంపూర్ణ విశ్వాసమున్నట్లుగా ఆ తీర్మానాన్ని ఎటువంటి చర్చాలేకుండా ఆమోదించారు. వాషింగ్టన్ కాంటినెంటల్ ఆర్మీలో సామాన్య సైనికాధికారి. తనపై మోపుతున్న ఈ పవిత్ర బాధ్యతకు

జార్జి వాషింగ్టన్ ప్రతినిధులకు కృత జ్ఞత తెలుపుతూ తనకుగల యావచ్ఛక్తి తోనూ విప్లవ విజయానికి పాటుబడతా నని, తనపై వుంచిన ఈ అధిక గౌరవవానికి అర్హుణ్ణని నిరూపించుకు నేందుకు శాయశక్తులా శ్రమిస్తాననీ, తనకు ఈ బాధ్యతా నిర్వహణలో జీతభత్యాలేమీ అవసరం లేదనీ అన్నాడు. వాక్చతురిమలేని జార్జి వాషింగ్టన్ మాటలు అతిసామాన్యంగా కన్పించినప్పటికీ వాటిలో డెమోస్తనిస్ గంభీరత కానవచ్చింది. తనకి ఏం చెప్పాలో తెలియడములేదనీ తను అంగీకరించిన ఈ బాధ్యత ఆనాటి కానాడు క్లిష్టతరం కానున్నదనీ సౌమ్యుడూ, సామాన్యుడూ అయిన వ్యక్తి చేతిలో ఖడ్గముంచి దానిని సంఘ రక్షణ కోసము వుపయోగించమంటు న్నారనీతను కర్తవ్యతను, ఈ బాధ్య తను సక్రమముగా నిర్వహించేందుకు అందరి సహకారము, సానుభూతి కావా లనీ, ఎంతో వినమ్రంగా చెప్పాడు.

యాడిమ్స్ తన భార్యకు ఇలా వ్రాసాడు : "నేను వొట్టి బక్కమనిషిని. నా కాలమంతా స్వాతంత్ర్య ప్రయత్నా నికీ, ఉదరపోషణకూ వ్యయమవు తోంది. ఆరోగ్యము కూడా అంతంత మాత్రముగానే వున్నది. నేను నాటు తున్న ఈ స్వాతంత్ర్య వృక్షపుష్ప మాలలు ముందు తరాలవారు ధరి స్తారు. ఈపువ్వులు నాకుకాదు. ఇతరుల కంఠ సీమను అలంకరించేందుకు !" తొంభై మైళ్ళ దూరానవున్న జార్జి వాషింగ్టన్, పూలమాలల మాట ఎలా వున్నా, అగ్నికీలల మధ్య నడుస్తు న్నాడు. జఫర్సన్‌కి తెలుసు తమ మిత్రునిలో వెనకడుగూ, వోటమీ లేదని ! ప్రజలు తమ మహానాయకుని గుర్తించినట్లయింది. వారు అతని వెనుక బారులు తీర్చినిలబడతారు. బయటదేశాలనుంచీ భగవంతుని వద్ద నుంచి కూడా సహాయం లభిస్తుంది. ఎందుచేతనంటే తమది న్యాయబద్ధమూ మహెూదాత్తమూ అయిన పోరాటము గనుక !

"అతని మనసు శక్తివంతమైనది - మెదడు చురుకైనది. చిన్న విషయా లలో చిరాకుపడవచ్చు. గంభీరవాక్యా లతో పరులను మందలించవచ్చు. కాని ఆత్మవిచారమూ సునిశ్చయమూ అతని స్వభావగుణాలు. అవే అతనిని అధికునిగా చేస్తున్నాయి. దర్జాగా, గంభీరముగా, కలుపుగోలుగా వుండే యీ వ్యక్తి భయప్రమాదాలకి అతీ తుడు. ఎంతటి అపాయస్థితిలో కూడా తన లక్ష్యమే తప్ప వాంచల్యాన్ని ఎరుగని ధీరుడు సౌజన్యమూ, ఔదా ర్యమూ అక్షరాలా మూర్తీభవించిన సత్పురుషుడు," అని జఫర్సన్ తన డైరీలో వ్రాసుకున్నాడు జార్జి వాషిం గ్టన్ గురించి! హాన్‌కాక్ అధ్యక్ష స్థానాన్ని హారిసన్‌కి ఒప్పగించాడు. కమిటీ, స్వాతంత్ర్య పత్రాన్ని పరిశీ లించేందుకు వుపక్రమించింది. బ్రిటిష్ పార్లమెంటుకు సంబంధించిన విషయం తామ్సన్ చదువ నారంభించాడు. మన పవిత్రభూమిని రక్తపాతములో ముం చేందుకు వారు మనపైకి కిరాయి

సైనికులను పంపుతున్నారు. మన ఆత్మాభిమానం ఇటువంటి వారిని సోదరులుగా ఎలా ఆమోదిస్తుంది? మనపై వీసమంత జాలికూడా లేని వీరు మనకి సోదరులెలా అవుతారు?

కొందరు ప్రతినిధులు అసమ్మతి సూచకముగా తలలూపారు. బ్రిటిష్ ప్రజలందరినీ మొత్తము మీద శత్రువులుగా భావిస్తూ వారిపై నిందమోపడము రాజకీయనీతి కాదన్నారు. బ్రిటిష్ వారిలో కొందరు అమెరికాలో జరుగుతున్న ఈ స్వాతంత్ర్య ప్రయత్నాలపట్ల సానుభూతి చూపుతున్నారు. కాలక్రమాన తమకూ బ్రిటన్‌కూ వ్యాపార ఒప్పందాలు కుదరవచ్చు. అంతేగాక, బ్రిటిషు పార్లమెంటు గురించిన అభియోగాలేమీ ఇందులో వుండకూడదన్నారు. ఇందుకు సంబంధించిన చర్చ మధ్యాహ్నము వరకూ సాగింది. పార్లమెంటు ప్రస్తావన ఇందులో తేరాదనీ, బ్రిటిష్ ప్రజలను విమర్శించరాదనీ ఏకగ్రీవంగా ఆమోదించారు. వాటిని పత్రంనుంచి తీసివేశారు. తన స్థానంలో నిశ్శబ్దంగా కూచున్న జఫర్‌సన్ వారి విమర్శలు శ్రద్ధగా విన్నాడు. వారు తెలుపుతున్న అభ్యంతరాలను నిశ్చలహృదితో నిశ్శబ్దంగా విని, ఎంత మంచి జరగగలదో అంతే జరగనీయమని తనలో తాను అనుకున్నాడు.

థామ్సన్ చివరి పేరా చదివిన తర్వాత అనేక సూచనలు చేయబడ్డాయి. స్వాతంత్ర్య పత్రపు కడపటి భాగమూ హెన్రీ లీ తీర్మానపు చివరి భాగమూ యించుమించు ఒకటే! వీటన్నిటి తదుపరిని అతిముఖ్యమైన సమస్య ఎదురయింది. అదే బానిసత్వ సమస్య ఏమిటి. దీనిని వదిలి వేయడమా? లేక, మార్చడమా? లేక, పూర్తిగా ఉపసంహరించుకోడమా? అదిక సంఖ్యాకులు బానిసత్వానికి వ్యతిరేకంగా వున్నారు. దేశమంతటా దానిని నిషేధించాలని! కాని రెండు రాష్ట్రాలు మాత్రము అభ్యంతరం తెలుపుతూ, తాము పట్టినపట్టు విడువకుండా మొండిగా వున్నాయి. దక్షిణ కెరోలినా, జార్జియా రాష్ట్రాలు రెండూ బానిసత్వము పై ఆధారపడి వున్న రాష్ట్రాలు. బానిసల శ్రమతో కాని వారి పంటలు పండవు. ఈ క్లాజు పూర్తిగా మినహాయిస్తే తప్ప స్వాతంత్ర్య పత్రంపై చేవ్రాలు వుంచేందుకు వారు అంగీకరించడము లేదు. నూతన విన్నపాలతో హేతుమార్గ వుద్బోధనతో మానవధర్మమూ భగవదాదేశమూ మున్నగు సద్భావాలతో వ్యతిరేకముగా వున్న ఆ రెండు రాష్ట్రాలనూ తమవైపు తిప్పుకునేందుకు మిగిలిన ప్రతినిధులు సర్వ ప్రయత్నాలు చేశారు. కాని, అవి అన్నీ వృథా అయాయి. ప్రతినిధులు ఆ క్షణానికాక్షణము వి సు గు ద ల కనబరుస్తున్నారు. మధ్యాహ్నపు ఎండ వారిని మరింత చికాకు పరుస్తోంది. జఫర్‌సన్ ఈ దృశ్యాన్ని పరికిస్తున్నాడు. అధిక సంఖ్యాకుల అభిప్రాయ ప్రకారము ఈ యిరువురూ తమ అభిప్రాయము మార్చుకుంటారని

భావించాడు. కాని వారిరువురు మార్చు
కోలేదు. తమనుంచి చీలిపోయేందుకు
సిద్ధముగా వున్నారు. ఈ చీలిపోవ
డము శత్రువుకి లాభసాటి అవుతుంది.
అటువంటి సమయంలో ఈ విషయమై
చర్చించడమూ వారిని హేతుమార్గా
నికి తిప్పుకోగలమని అనుకోడమూ
వృధాశ్రమ, దక్షిణ కెరోలినా, జార్జియా
రాష్ట్రాల ప్రతినిధులను ఒప్పించ
డము జరిగేపని కాదని జాన్
యాడమ్స్ గ్రహించాడు. ఈ తీర్మా
నాన్ని వాయిదా వేయడము పడదు.
ఈ పూట ఇది తెమిలిపోవాలి. తమ
ఐక్యతకి భంగకరముగా ఏదేనా
సమస్య వుత్పన్నమైతే, దానిని తెంచి
వేసి, ఐక్యతను కాపాడుకోవాలి; ఐక్యత
ముఖ్యమైనది. ఈ సభికులు తమ
వుపన్యాసాలలో చివరికి ఏమి నిర్ణ
యించ దలచుకున్నారు? ఈ వాద
ప్రతివాదాల పర్యవసాన మేమిటి?
అవతల రెండు రాష్ట్రాలవారు కూడా
– ఐక్యతయే ప్రధానమంటున్నారు.
ఇది రాజనీతికోవిదుల సభాంగణము.
ఒక నూతన జాతి ఉన్నతా ధర్మాల
పునాదులను ఈనాటి ప్రతినిధులు
నిర్మిస్తున్నారు. తాము అల్పులు,
అసూయపరులు కారాదు. అల్పజ్ఞులు
ఒక మహా సామ్రాజ్యముతో తలపడ
లేరు. ఏక్షణాని కాక్షణం ఎంతో
విలువైనది, ఇక కాలయాపన తగదు.

డాక్టర్ ఫ్రాంక్లిన్ కూడా సమస్యా
పరిష్కారానికి మార్గాన్ని చూపించ
లేకపోయాడు. ప్రస్తుత పరిస్థితులలో
ఉన్నత లక్ష్యము కోసము రాజీపడ
డమే బుద్ధిమంతుల లక్షణమని భావిం
చాడు ఫ్రాంక్లిన్. ఫ్రాంక్లిన్‌కి ఆంత
ర్యంలో ఒక మహాసత్యం తెలుసు.
కొందరు ప్రతినిధులను సమావేశ
పరిచి, సామూహిక బుద్ధి బలంతో అది
ఒకే కూటమిగా లోకదృష్టికి కనబడే
టట్లు నిర్ణయము చేయదలచు
కున్నపుడు, అయావ్యక్తులు. తమ
దురభిప్రాయాలను సంకుచితోద్రేకా
లను, తమ పొరబాట్లనూ, స్వలా
భాలనూ. స్వార్ధచింతననూ విడనాడ
లేరు. కలిసి కట్టుగా పనిచేస్తూ ఇది
ఒక కూటమిగా నిర్ణయమని లోకానికి
చెప్పదలమకున్నపుడు ఈ అవ
రోధాలు విధిగా వుంటాయి.

కాని ఈ ప్రమాదకర పరిస్థితిలో
కనీసము భవిష్యత్ నిర్మాణానికి
పునాదులు పడడము అత్యవసరము.
ఈ మహాయజ్ఞములో హతులవగా
మిగిలినవారి తనయులలో కొందరైనా
మానవతకు పవిత్రదేవాలయంగా
నిర్మింపబడిన దీనిని ఇంకొంచెము బాగు
చేసి, యిందులో గల లోపాలు సరి
దిద్దగలుతారు. దక్షిణ కెరోలినా ప్రతి
నిధి రట్లెజ్‌కి తురుపుముక్కలు తన
చేతిలో వున్నాయని తెలుసు. జార్జియా,
దక్షిణ కెరోలినా రాష్ట్రాల ప్రతినిధు
లకు ఆక్షేపణీయముగా వుండే భాగా
లను స్వాతంత్ర్య పత్రము నుండి తీసి
వేసి మిగతాది సభవారు ఆమోదిం
చారు. ఆ తీసివేతలూ తగ్గింపులూ
అయిపోయాక స్వాతంత్ర్య ప్రతిని మళ్ళీ
మరొకసారి సభవారికి చదివి విని
పించారు. తమ ఉద్దేశాలు, తమ

ప[illegible]కలు, తమపై జరిపిన అక్రమాలూ, తమపై వేసిన అభాండాలు - ఇవన్నీ మరొకతడవ విన్నారు సభ్యులు. "మేమందరమూ ఒక్కుమ్మడిగా సర్వస్వతంత్రుల మయేందుకు, ఈ అన్యాయాలని ఎదిరించేందుకు, ఈ పవిత్ర సమయములో ప్రతిజ్ఞ తీసుకుంటున్నాము. మేమందరము ఒకరికొకరము అండగా నిలిచి, ప్రాణమాన ధన నష్టాలకు వెనుకాడక మా కర్తవ్యాన్ని అకుంఠిత ధైర్య విశ్వాసాలతో [illegible]వేరుస్తాము."

ర్యదర్శి థామ్సన్ వోట్ల లెక్కింపు ప్రారంభించాడు. రాష్ట్రాల వారీ లెక్కింపు ప్రారంభమయింది. ప్రతినిధులు ఒకరి తరువాత ఒకరు నిలబడి తమ వోటు తెలియబరిచారు. అంతా అయాక హాన్‌కాక్ ఇలా ప్రకటించాడు "అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రతినిధులు ఈ స్వాతంత్ర్య పత్రాన్ని ఏకగ్రీవముగా ఆమోదిస్తున్నారు" - ఇక స్వాతంత్ర్య పత్రముపై సంతకాలు పెట్టడమన్న లాంఛనము ప్రారంభమయింది. తమ స్వాతంత్ర్య ప్రయత్న మొకవేళ అణిచివేయబడితే, ఈ సంతకమే తమకి వురిత్రాడవుతుందని ప్రతి ఒక్కరికీ తెలుసు. తమకు వురిత్రాడు అవటమే కాకుండా తమ యిళ్లూ వాకిళ్లూ ధ్వంసమై భార్యా పిల్లలు దిక్కులేని దీనులవుతారు.

స్వాతంత్ర్య పత్రముపై మొదట చేవ్రాలు వుంచినది జాన్‌హాన్‌కాక్. విడివిడిగా కనిపించే పెద్ద అక్షరాలతో అతను సంతకంపెట్టాడు. ఆ తరువాత ఒక్కొక్కరే సంతకం పెట్టారు. ఆరో సమావేశానికి హాజరుకాలేకపోయిన పదిహేనుగురూ 1776 అగస్టు 2వ తేదీన సంతకాలు పెట్టారు. తీర్మానములో మరొక క్లాజుకూడా ప్రవేశపెట్టబడింది. "దేశద్రోహులు, గూఢచారులు ఒకరిపై ఒకరు కత్తికట్టకుండా - వుండేందుకు ఈ స్వాతంత్ర్య పత్రముపై చేవ్రాలు వుంచని ప్రతినిధికి కాంగ్రెస్ సభలో ప్రాతినిధ్యము వుండబోదు" - స్పీకర్ బల్లకి వెనుకవైపున వెల్లెరే ప్రతినిధులు సంతకాలు పెడుతూండగా ఒక్కొక్కరినే శ్రద్ధగా గమనిస్తూ నిల్చున్నాడు. ప్రతి ఒక్కరూకూడా ఈ క్లిష్టసమయంలో తమ బాధ్యతను గుర్తిస్తున్నవారే! ఎవరిలోనూ వీసమంత భయవింతన లేదు - ప్రతిఒక్కరి ముఖమూ ప్రశాంతంగా వుంది.

శామ్యూల్ యాడమ్స్‌కి అది తన జీవిత లక్ష్యాన్ని అందుకున్న శుభ ఘడియం సంతకము పెడుతున్నపుడు జాన్‌యాడమ్స్ నేత్రాలు ఆనందంతో తళతళ లాడాయి. ఈరోజుకోసము అతను ఎంత కాలంగానో ఎదురు చూశాడు. హాప్‌కిన్స్ సంతకంపెడ్తున్నపుడు అతని చేతులు, అక్షరాలు స్పష్టముగా కనపడనంతగా వణికాయి. తనని పరిశీలిస్తున్న ఎల్లెరేని వుద్దేశిస్తూ స్టీఫెన్ హాప్‌కిన్స్ అన్నాడు.

(ఇంకా వుంది

**మాతృక : కార్నెల్ లెన్‌గ్వెల్**

**తెలుగు : యన్నార్ చందూర్**